క. దరి కరుదెంచిన యీ మధు
కరుఁ బఱచకు మెప్పుడుఁగూడఁ గలభమ వీనిన్
శిరసావహించుకొనుఁ గరి
వరేణ్యములు దాన వారి భర సుందరముల్.

క. సుర వనికా సుమ పరిమళ
పరాయణతఁ గోర్కు లెల్ల ఫలియించిన బం
భరునకుఁ దలంపఁ బుష్పాం
తర సేవాసక్త బుద్ధి నగుఁబాటొకా.

మ. ఇలఁ జెమ్మైనను లేదు మాలిమతి వోయెం గావిరుల్ గ్రమ్మె ది
గ్వలయం బుద్ధతవాత్య నెండ సహియింపన్ రాని దిట్లీ మరు
స్థలి నీ సంపఁగిమొక్క సర్వ మొకల్లై చంపం దలంపన్ సుధం
జిలుకం దా నెటనుండియో విధి వెలార్చెన్ నిన్ను ధారాధరా.

క. సౌరఘురిం జేరెడు నిను
వారింపఁగఁ బోము గాని వర్షానది నీ
నీరస తరంగ లీలల
నేరుపు దానికడఁ దగదు నిగిడింపంగాన్.

క. సకలాటవి గాలించె వె
దకి వెదకి రసాల చూచెఁ దరు లన్నియు నిం
తకుఁ దేఁటి చూడలే దీ
సకల జగమ్మందు నీకు సమ మగు దానిన్.

క. అళివోలె నీతఁడును బరి
మళ లుబ్ధయి చేరె ననుచు మదిఁ దలఁపకు మీ
మెలగాలిఁ బరహితార్థమె
నళినీ యిటు దిగియె యాచనకు ఘనుఁ డయ్యెన్.

మ. మొదలా స్థూలము పాదుగట్టిది దృఢవ్యూఢంబు శాఖాళి నీ
సదనం బేరికిఁ జేరరాని గిరి యే జంకుండుఁ గానీ యొకం
డెద నాధిజ్వర మేర్చు నిర్ఘృణ శిఖా నృత్తప్రతాపుండు నిన్
దుదముట్టించు దవాగ్ని ఘస్మరుఁడటంచున్ భూరుహోత్తంసమా.

చ. ఖరకరు వేఁడివెల్గులఁ బొకాలియు దీర్ఘములైన గ్రీష్మ వా
సరముల నెట్టెటో కడపెఁ జాతక మాత్మ నినుం దలంచుచున్
దరిసెన మెట్టకేన్ జలద దైవవశమ్మున నీ వొసంగియుం
గరకరి దాని నిప్డుఁ గరకాహతి సేసి యనుగ్రహింతువే.

క. హితమగు నిర్గుణతయె యం
చిత గుణ గౌరవము కల్మి ఛీ యేమిటి కి
ట్టితర తరులెల్ల సుఖ సం
గతి బ్రదుకఁగఁ జందనములె ఖండితము లగున్.

క. పుయిలోట ప్రతిఫలాపే
క్షయు స్నేహముఁ బ్రేమమేనిఁ గన మైన జగ
త్త్రయ ఘోర తాపమంతయు
నయారె మాయించు నీ మహాత్ముఁడు ఘనుఁడో.

క. తరులెల్లఁ దఱచి చూచెం
బరభృతముల నడిగి వినియె మాకందమ యెం
దరిగిన నీకుం జాలిన
తరు వీలోకమునఁ దుమ్మెదకు దొరకదుగా.

క. తరుకుల సుష మాపహరణ
పరాయణం బఖిల జంతు బాధాకర మే
మరసితి విట హిమరాసుల
నెఱిఁగి యెఱిఁగియే భరింతు హిమవన్నగమా.

ఉ. హరి మదాంబు సంభ్రమ విహార మధువ్రతముల్ కరుల్ భయం
బూనెడు చూపులన్ నిలువనోప వెటం దెలి ముత్తియంబు లే
దారిని దొర్లుచుండు హరి దైవగతిం బరమేగఁ దద్దరీ
ద్వారతలంబునన్ శివశివా యిపు డుప్పతిలెన్ శివారుతుల్.

క. కరికుల విరోధి హరి జా
ఠరాగ్ని తన్నెంత పుట పుటన కాల్చెన యేన్
బరిమార్చునె భయ శంకలు
దొఱఁగి తనుం జేరు లేడి తుటుముల నెందున్.

తే. పొగరు కనుగప్పి యిటుఁ గృష్ణమృగము లేళ్ల
నడుమ నిక్కాన నాడుచున్నావ యేమి
దళిత కరి కుంభ గళిత ముక్తా మయంబు
హరి విహార స్థలంబిది యరసి బ్రదుకు.

చ. ప్రతి విక చామర ద్రుమము పాకవిరోధి వనమ్మునన్ మధు
వ్రతుఁ డితఁ డాదిమూరుకొన వాడినపూవులె మూరుకొండ్రు దే
వతలును వాఁడె కాలగతి వల్ల మరందము వేఁడ లోభివై
మతకము పన్నెదేఁ గమలమా యెటులుండును నీవ చెప్పుమా.

క. కనుమోడ్చి లీలగా యే
మని కునికెదు నిద్ర యిప్పుడా కరివర తీ
రనిపగ గలిగెను హరితో
మునుముం దిఁక ముదిరి చావె మూఁడును నీకున్.

క. రతనములి వేల యభ్రా
యిత మీ తనువేల పథికు లేఁకరిలి త్వ దా
గతులయినఁ బుట్టదుగదా
సుతరా మొక మంచినీటి చుక్కయు నబ్ధీ.

ఉ. మావికషాయ మంకురము మాత్ర భుజించి రసజ్ఞ కోకిల
మ్మావికి మెచ్చి తద్యశము నెల్లెడఁ జాటుఁ దదీయ మాధురిం
ద్రావు నళుల్ ముఖస్తుతి పరాయణ మాత్రము లీ ద్విజాతులం
దేవిధి మంచిచెడ్డలు గ్రహింపఁగఁ జాలు వివేక ముండెడిన్.

క. కలఁడే నీ పరిపాటిన్
మలయజమా తెలిసికొన సమర్థుఁడు నిన్నున్
నలిగులి నూరిన వారికె
బలకరముగఁ బిండివయ్యుఁ బరిమళ మీవే.

ఉ. ఇంతటి జీవనస్థితి వహించిన కాలమునందె దప్పికన్
గొంతుక లెండు వారి దగ గుప్పున నార్పవ యేని గ్రీష్మ వే
ళాంతమునన్ సరోవరమ యర్కుని తీవ్ర కరాగ్ని జీవనం
బంతయుఁబోయి యేరి దగ నార్తువమో కృశియించి చూడుమా.

క. కినుక వహింపవు గద నే
నని యెద నొకమాట నిను మహాత్ముఁడ వయ్యున్
వనధీ నీ కడనే కొను
ఘనుఁ డితఁ డిడు జలముగూడఁ గాదనవుగదా.

క. నీవల వింధ్యం బుట్టిన
పావనమగు నదివి లెస్సఁ బరికింపు మెదన్
నీ వెండిపోవుటయె మే
లీ వీథుల ముఱికి నిగ్రహించుట కంటెన్.

తే. ఈమహాటవి నేకాకి వీవు పికమ
యిట్టులే బ్రతుకుము కంత మెత్తఁబోక
పాపమతు లయ్యుఁ దమజాతి పక్షి యనుచు
గాసివెట్టక యుండు నీ కాకిమూఁక.

క. తుందిల మరంద లసదర
విందమ్ములన దినము లట్లు వెడలించిన యిం
దిందిర మిప్పుడు కుటజము
నం దేగతి గడుపు వాస రావసరమ్ముల్.

క. ఎఱుకకుఁ గాని బకమ్ములు
పఱచెనె యని యెడఁదఁ గించపడకు కమలినీ
చిరజీవులు గాత మళుల్
పరిణత మధు రస వివేక పండిత మాళుల్.

ఉ. మొక్కలనెల్ల నొక్కగతిఁ బ్రోవఁగఁజూచెనె కాని మాలి దా
నెక్కుడు చూపఁ డక్కటిక మీ వకుళమ్మును సాక నైన నీ
మొక్క క్రమమ్ముగా నెదిగి పూవులు పూచి పరీమళించుచున్
దిక్కులఁ దేంట్లగీతికలు దీటుకొనన్ రహియించె నెంతయున్.

క. మలయజమా యెవ్వరి వా
క్కులకందును నీదు మహిమ ఘోరవిషమ్మున్
వెలిగ్రక్క త్రాఁచులను బరి
మళపు సముద్గారములను మనిచెద వోహో.

క. ఓ రాజహంస నీవే
నీరక్షీర ప్రకార నిర్ణయమున జం
పూరక నడుపఁ గులవ్రత
మేరీ పాలించువార లిఁక నీ జగతిన్.

క. కొలఁకా నీ వింకినయెడఁ
బులుఁగులు దివికరుగు భృంగములు మామిడి మొ
గ్గల మూఁగు నేమగునో యిఁకఁ
దెలియదు మీనంబు దీనదీనం బకటా.

మ. వరుసన్ నీడలుఁ బుష్పముల్ మధురముల్ పండ్లిచ్చి మార్గ శ్రమా
తురులం దృప్తి యొనర్చు నీతరు కు లేం ద్రుం డం చటన్ జేరె నే
మెఱుఁగన్ వాఁడు తదీయ కోటర పుటీ హేరాళ హాలాహల
స్ఫుర దుత్తాల ఫణా కఠోర నటనా శూరున్ ఫణి గ్రామణిన్.

క. సకలోర్వీ ప్లావనవంతం
బొక చాతకమే కదా యొహోహో యది చిరజీ
వికయపుత మడుగుఁచో నొక
సకల సు రాధ్యక్షు నడుగుఁ జచ్చును గాదే.

క. కరి కుంభ దళన గళ దురు
తర ము క్తాస్తరణ ధరణి తల మగు హరి యె
క్కరణి హరిణముల దరిఁ దన
పరాక్రమము గూర్చి విన్నపము చేసికొనున్.

చ. మును ననకారు కాలమునఁ బువ్వుల గుత్తుల మంజు గుంజిత
స్వనముల బంభరుంశ పెనుబండువు లీవటు చేసికొన్న యీ
తను సహకార శాఖ యిటు దైవగతిం గృశియింపఁ దొంటి నీ
వినయము చూపవేనిఁ బృథివిన్ భవదన్యుఁడు నీచుఁడుండునే.

క. జగ దభ్యుదయ గుణోదయ
లగు విద్వాంసుల రుషయును నతిరమణీయం
బగు జన మోహన పరిమళ
మగు కాశ్మీరము కటుతయు నతిరమ్యమె కా.

క. గురువుల పరు షాక్షర వా
క్తిరస్కృతులు వడయు నరులె తేజో మహిమం
బొరయుచు నుందురు సానల
నఱుగని రతనమ్ము లెక్కనా నృపుల తలల్.

క. జలద గభీరములగు నుఱు
ముల నాఁగుము మదగజేంద్రమో యను భ్రాంతిన్
నెలనిండిన నా చూలు
చ్చలించుచుఁ గలంచుచుండె జఠరం బెల్లన్.

మ. అమరానీకము ముందటన్ నిజ భుజా హంకార హుంకారపుం
గ్రమ మగ్గించి పురారి మార్కొని శరారంభం బొనర్చెన్ మరుం
డమరావత్యమృతాననా నయన చంద్రాలోక శంకా శరీ
రము ఫాలానల భస్మసాత్కృతికి నర్హంబయ్యె నువ్వెత్తుగన్.

క. ఖలు సత్కరించు నాతఁడు
జలములఁ దన వ్రాలు వ్రాయ సాగెను గగన
స్థలిఁ గాపురమ్ము పెట్టెను
సలిలమున సమీరుఁ దడుప సన్నాహించెన్.

క. మృతు జీవితరతి యసతికిఁ
బతిపయిఁ బ్రీతియును లుబ్ధువాదాన్యత దు
ర్మతి మైత్రి చిలువ తాలిమి
గతయుగముల సృష్టియందుఁ గన్పడ వెందున్.

తే. అనపరాధుల ప్రాణమ్ము లాహరింపఁ
ద్రాచుఁబాములకన్న మేధావు లరుదు
సుమతి హిత కార్యములకు విఘ్నము లొనర్ప
ఖలులకంటెఁ గుశాగ్ర బుద్ధులును లేరు.

ఉ. బీదలు దీను లౌ రయితుబిడ్డల యెండిన పైరు లెల్లనుం
గాదని కట్టిపెట్టెదవు ధూమ్రధర సంతతి కీగి యెల్ల నీ
వాదట నంత కున్నతము నొ పద మందిన దుర్మదాంధపుం
జోదువుగాదె తెల్లముగఁ జూపితి నీ యవివేక మంబుదా.

క. జ్ఞానమయదీపమున కు
గ్రానిల మానందమృగచయమునకుఁ గార్చి
చ్చేనికపతి నడవడి యను
మ్లానుల పాలిటికి ఖలసమాగమ మరయన్.

చ. సలలిత హేమ పంకజ రజ స్సురభీకృత దేవతానదీ
చల దురు వీచిడోలికల సౌఖ్యముగా మనుచుండు రాజహం
స లిపుడు దైవయోగమున శైవల జాల జటాల పంకగం
ధిలమగు నీటికే యకట దిక్కటి యీ గతి దేవురించెడిన్.

క. సాదులకు జరగు హితముం
బూదియొనర్పంగ ఖలులు బుద్ధిమదీశుల్
బీదలగు నిరపరాధుల
గాదిలి ప్రాణములు దీయఁ గఱదులవారల్.

మ. అయయో యేమిఫలాశతో గుణగణం బార్జింప యత్నించెదో
నయబుద్ధీ యిది యాత్మ సంస్కృతి కనన్ నా మాట పథ్యమ్ము వి
న్మయదంబుల్ హృదయంగమంబు లని నీ వాశించు నీ భావసం
చయమేకా కలికిం గళేబరము నోమన్ సాయమా రేవగల్.

క. ఘనకార్యము చేసితి వ
త్యనుపమమగు యశముగూడ నార్జించితి వే
మనునంతదనుక నీకో
యనుఁగుసఖా యొసఁగుచుందు నాశీశ్శతముల్.

చ. అమలసరస్సునన్ జనన మర్కుని హస్తమునన్ వికాసమున్
రమకు విలాసగేహ మమరావతివాసులు మెచ్చు తావు ల
న్యములగు సద్గుణంబుల నుదార విఁకిష్టు ద్విజావతంస హం
సము వలపేని యంబుజమ సన్నుతికెక్కెద వింతకంటెనున్.

క. నడికినిశఁ బుట్టియును జెవి
దడవు నెదో గర్జ వినుచుఁ దల్లియొడి నొడల్
ముడుఁచుకొని సింహశిశు వె
ప్పు డెప్పుడని పొంచియుండెఁ బోయి పయిఁబడన్.

మ. పటు బాహా యుగ మండలీ కృత ధను ప్రాతంపత న్మార్గణ
చ్ఛట విచ్ఛిన్న విపక్షమండలు నినున్ సంగ్రామభూమిం గనన్
నట దుత్తాల మహోగ్ర గాండివ చల న్నానా శర జ్వాలికా
పటలీ తాండవ దగ్ధ ఖాండవు నెదన్ భావింతు నప్పాండవున్.

క. సకల పరిమళములకును
మకుటము నా పరిమళమని మదమూనకు దా
ని కతాననె గిరిగుహల బ్ర
దుకు నీ జనకునికి మూఁడదో కస్తూరీ.

చ. ఎడఁగల ప్రేమతోఁ గరిణు లెత్తిన చేతులు చాఁచి నీయొడల్
తడుముచునుండ లీలగ మదావళమా చెలులాడు కొండలం
బడి ప్రవహించు నిర్ఝరుల వారి మునుంగు సరోజరాజి సా
పడు మిఁక నంతెకాని మృగవల్లభు డీకొను బుద్ధి మానుమా.

క. సరసు లను దూదిరాసుల
పరిపాలనమునకుఁ గుమతి వైశ్వానరుఁడా
పరదుఃఖానలశాంతికి
మరుత్తు ఖలు డతనిఁ దెలుప మాటలు గలవే.

క. శమశీతలతకు ననలము
విమలయశో గంధమునకు వెల్లుల్లి కృపా
సుమములకును గగనం బు
త్తమజనకంటకుఁడు ఖలవతంసుం డుండన్.

చ. నను మధుపాయి వీఁ డిటు లనాదృతి చేసె నటంచు సంపఁగీ
మనమునఁ గుందకమ్మ కొఱఁ పూలిన జంతు వి దేమిలెక్క సం
జనిత వినీల నూతన ఘనాఘన మోహనమైన వామ లో
చనల మసార మేచక కచ ప్రచయమ్ము నఫుఁ జయంబగున్.

తే. మలినుఁడ వటంచు రాగము మాన లేదు
వదరుఁబోతని నగుమోము వదల లేదు
తిరుగుఁబోతని రసికత పరిహరింప
దేమని సరోజినిఁ ద్యజింతు వీవు మధుప.

చ. హరిహయు వీఁడు నందు మును పాగతి సుందర నందనంబునం
దిరిగి మరంద మానుచును దీయని పాటల నాలపించు బం
భర మిపు డయ్యయో కటికి పస్తుల నోరును గొంతు నెండి సు
స్వర మధు రాలపం బెడలి పాలుపడెన్ బదరీ రసాప్తికిన్.

క. పంకము లేని సరస్సుఁ గు
శంకలుగల ఖలులు లేని సభయుఁ గటు వచ
స్సంకరము గాని కృతి విష
యాంకురములు లేని హృదయ మతిరమ్యంబుల్.

క. సంతత పర హిత కార్య ని
తాంతుల వాక్యములు తీయదన మంచు సుధా
వంతము లేద యొక సంద్రము
కాంత శరచ్చంద్ర చంద్రికయ యగు యశముల్.

క. ఎంతటి డంబమ్మున్నర
వంతయు నిర్గుణుఁడు వెలుఁగఁడా పాత లస
త్కాంత నితాంత లతాంత ని
శాంతంబగు శాల్మలీ మహాద్రుమము గతిన్.

మ. తన క్రీడల్ వినుదాఁకు పీచి నిచయ ధ్వానమ్ము మంథోర్విభృ
న్మణి సంఘట్టిత రావ మర్ల భ్రమ దిశా దంతుల్ భయం బందుచుం
గన నుత్తుంగ తిమింగ లాంగ కబల గ్రాసోగ్ర మా రాఘవం
బనయం బెచ్చట నాడుఁ గేలి కలహ త్యక్తాబ్ధి యాచో నిఁకన్.

తే. ఎన్నఁడును లేని యౌదార్య మిదుమలందె
సంతరించు మహాశయచక్రవర్తి
తాను సాంతముఁ జిచ్చులోఁ దగులవడుచు
నబ్బురపుఁ దావు లొసఁగ దే యగరువత్తి.

క. కృతుల రస భావ తత్త్వ
ప్రతిపత్తి గ్రహింపఁ జాలు భావుకు లరు దీ
క్షితి మధు రస మర్మ కలా
మతిమంతుఁడు గలఁడె యొక్క మధుకరుఁడు వినా.

చ. పరహిత తత్పరత్వమున స్వార్థము వీడి స్వభావ జన్యమై
పొరలు నభేదబుద్ధి గుణభూత జగమ్మున నర్థిలన్ నిజాం
తరమునఁ జారుతా లసదుదాత్త మహత్త్వము నర్తిలన్ మహా
పురుషుఁడొకానొకండనిశముం జయమందు మహోన్నతస్థితిన్.

క. ఫల కుసుమ పత్ర భరముం
జలి నెఱకల నోంచు రుజయు సైఁచి పరహిత
మ్ములకు నిజ దేహ మిడు తరు
కుల వర్యునకున్ వదాన్య గురునకు జేజే.

క. పర గుహ్య గుప్తి నిపుణుఁడు
సరస గుణాంచితుఁడు లోకసమ్మతుఁ డమలాం
బరమటు సుజనుఁడు బ్రదుకం
జెఱుతు రతని నెలుకలట్లుఁ జెనఁటి దురాత్ముల్.

క. గజఘట యను భ్రమఁ గరజా
గ్రజాగ్రదుద్దామశౌర్యకలన గిరిశిలా
వ్రజము పొడిసేయు హరి కెం
దు జనింపద హంస మొక్క తునకయు విధిచేన్.

చ. అమరులతోఁటనున్కి కలశాంబుధిఁ బుట్టువుఁ జాగ మెల్ల దే
శములఁ బ్రశస్తికెక్కినది సౌరభహాహృదయైకచోరకం
బమరుల కింక నర్థికిడు నత్తఱి నొక్క వివేకమున్న ను
త్తమముల యెందు దాతలకు దాత సురద్రుగుణంబులన్నియున్.

తే. వంశభవుఁ డైన సద్గుణవంతుఁ డైన
సంగతివిశేషముననె పూజ్యత వహించు
మహిమ గలుగునె వీణదండమున కెందు
వికలితం బయినట్టి తుంబీఫలమున.

క. బహులౌషధీయ గుణసం
గ్రహమగు వెల్లుల్లి యుగ్రగంధమున బలెన్
మహితగుణ మయ్యు నిందా
సహమగు వస్తు వొక దోషసంగతినైనన్.

క. తన గుణములచే శూన్యం
బున గూడను గుణనికాయ్యముం గొలుపుచు నెం
దును సందులున్న గప్పు సు
జనుఁడు జయమ్మందుచుండు సాలినిగతిన్.

మ. తలమాణిక్యము నాకలోకమున కాస్థానమ్ము దేవద్రుమం
బుల కీవాదు గదా శచీంద్రుల పురా పుణ్యైకపాకంబ వె
వ్వలనన్ ఖాండవరంగతాండవనటున్ స్వాహావిభున్ నీకు ద
వ్వల నాఁగ నసహ్యముల్భజింత్రు తొలివేల్పు న్నందనోద్యానమా.

చ. మధురముఖీ ముఖస్పృహము మాధురి నిర్మలవారిఁ బుట్టువున్
మధురిపు కేల నున్కి సుర మానస చోరము సౌరభమ్ము స
ర్వ ధనము నీవహో కవుల వాక్కులకుం గుసుమైకధన్వికిన్
మధుపము మీఁది ప్రేమ నెద మానవు పద్మమ యే మనన్ వలెన్.

క. చందనము పన్నగులకున్
విందిడు దీపమ్ము మసిని నెత్తి నిడుకొనుం
జందురుఁడును భజియించుం
గందును ధరియింత్రుఁ గొండెకాండ్రనె నృపతుల్.

క. సుజనుఁ డడుగక యె హితముం
బ్రజ లానందింపఁ జేయుఁ బరు లెవ్వరు తన్
భజియింపఁ గుముదముల శశి
యజస్ర మలరించుఁ దన యుదార కరములన్.

చ. మలయజమా జగ త్త్రితయ మాన్యము సౌరభ ముజ్జగమ్ము శీ
తలతయు దిక్సతీ సదన తాండవ నర్తకి కీర్తి యైన నా
పలు కొకఁ డాలకింపు విష వహ్నులు గ్రాయుచుఁ గోటరమ్ములన్
మెలఁగెడి త్రాఁచులే యకట మ్రింగు భవత్సుగుణంబు లన్నియున్.

తే. ఆపదలఁ దాను జిక్కియు నహరహమ్ముఁ
బరుల కుపకారమే చేయుఁ బండితుండు
మృతిగనియు మూర్ఛితంబయ్యు మేలెచేయు
పారదరసంబ దీనికిఁ దారకాణ.

క. ఖలుఁ గపటదూషితుని ద
వ్వులనే వర్జింత్రుఁ దమకు ముప్పగు ననుచుం
దలఁచు జను లెల్ల విష వి
హ్వలమగు హేతువునఁ ద్రాఁచుఁబామును బోలెన్.

క. పరు వేఁడికో లనెడు దు
స్తరచిం తానల శిఖా వితానమ్ములనర్ఁ
గుటిగాని యెదలతోడర్ఁ
దరువులు జీవించు సంతతము ధన్యములై.

మ. సృణిఘాతమ్ముల దలంప బాది బ్రదుకుం జింతింప దేశాంతర
వ్రణముల్ లెక్కిడ మాంసలాంసమున మావం తెక్కినర్ఁ ద్రొక్కినర్ఁ
గణుతింపర్ఁ వ్యథ యెక్కఁడే కలభముల్ కంఠీరవ త్రస్త కా
రణ జీవుల్ గల నాదు యూథము వనిర్ఁ గాపాడ దిక్కెవ్వరో.

తే. నమ్మి చేరిన ప్రాణిప్రాణములు నే నొ
కంటన హరింతునని లుబ్ధకా వగవకు
రాజగృహములఁ బుణ్యతీర్థముల గూఢ
మతులు నినుబోని సాధుహింసకులు గలరు.

చ. రతనము లర్కబింబ రుచిరంబులు పొర్లుచు నుండు బాలతో
జతపడి సీదువేల జలజంతులఁ గూడి రమావిభుండు ని
ద్రితుఁ డగు నీ యెడంద నరరే యవివేకము నిట్టి యున్నత
స్థితియును గాంచి తిట్టుమనొ క్షీరనిధీ నినుఁ బ్రస్తుతింతునో.

క. కృతి లోకోత్తర మాకృతి
కుతుకం బార్తులకు నంతకు మనఃప్రకృతుల్
హితకారులు మాటల తీ
రితరము పండితుల పోక లెవ్వఁ డెఱుంగుర్ఁ.

క. ఒక కాష్ఠజాతి జాతి జ
నకుఁ డొక చట్రాయి చందనంబ భుజంగుల్
సకు లైననేమి నీ గుణ
నికరమ కద కారణమ్ము నీకు మహిమకుర్ఁ.

మ. తమ కార్యాదృతిఁ దాము నాకు జనముల్ దవ్వైన యప్డే గత
భ్రమ నాసాగ్ర విభిన్న పంజర ముఖ ద్వారంబనై పోదు న
శ్రమనంచున్ శుక మొండు కోర్కి మధు వాస్వాదించుచున్నంతఁ జే
రె మహేంద్ర మొకండు దిక్కరి కర వ్రీడా కరాకారమై.

క. విలసిత సహకార వనీ
లలిత పరిమళ విహార లాలస యగు నీ
యళి దుర్విధిఁ ద్రిమ్మరు శో
షిలి మిడుతలదండు లుండు జిల్లేడు వనిన్.

చ. అహమునఁ గన్నుగానక మదావళమా యెటు చేరి తీ మహా
గహన మిటన్ క్షణం బయినఁ గాదు వసింప మదాంధ సింధుర
స్పృహఁదన గోళ్లఁ గొండలను బిండియొనర్చు మృగాధినాథుఁ డ
న్వహము శయించియుండు నఖుఁడా కనుమీ గిరిగర్భ గహ్వరిన్.

క. గురుగర్వమునన్ దిరుగకు
గిరిగుహలం దేన్గుగున్న క్షీరగళంబా
హరిశిశు వెతేఁగిన నీ గుహ
కరిణీపరి శేషితంబు గాదే తలఁపన్.

చ. విడుదల యయ్యె మాధుకరవృత్తి సువర్ణము గాజుగూడఁ గ
న్పడు నొకరీతి నీదయిన ప్రాపక మందిన దాదిఁ దేఁటి కే
ప్పుడు నిను గొడ్డఁటన్ నటుకఁ బొట్ట నిమిత్తముఁ జెట్టుఁజెట్టు నే
వడువునఁ గానలోఁ దిరుగఁబాల్పడునో వచియింపు చూతమా.

తే. స్వార్థమై సొమ్ము ధనవంతువలనఁ గొన్న
యతని మొగము తెలివిడప్పు టబ్బురంబె
జలధిజలము పరార్థమై సంగ్రహించి
సాంతముగ నల్లవడిపోయె నంతఘనుఁడు.

క. సమ దేభ గండ కండూ
ప్రమాణ పాండిత్య బద్ధ పరిపంథి మృగేం
ద్రము లేళ్ల నడుమ నిజ వి
క్రమ గాథ లుపన్యసింపఁ గడఁగునె యెందున్.

చ. లలిత కషాయ పత్ర రుచి లాలిత బాలరసాలలోల మం
జుల కల గుంజిత భ్రమరసుందర మాధవ నీవులేని కో
యిల కొడ లగ్నివోలె దహియించుగతిన్ మలయానిలమ్ము లు
జ్జ్వల దరవిందముల్ దశదిశల్ పొగ గ్రమ్మిన యట్లు గన్పడున్.

క. దళ దబ్జ పరాగ పరీ
మళ గాత్రులుఁ గరి కపోల మద పారణ మాం
సలులు మధుకరులు కాలము
వెలార్త్రు నిం బార్క తరుల విధియోగమునన్.

చ. నెగళులు మాపెఁ గొన్నిటి వనీ గజముల్ పుటమార్చెఁ గొన్నిటిన్
మిగిలినకాన గ్రీష్మ తరణిజ్వలనమ్ముల బూడిదాయె నే
దో గతి లవంగితీవియ యెదో యొక మూలన యుండి వాసనల్
బుగులుకొనంగ నల్దెసలఁ బోయె నయో దవవహ్నిదగ్ధమై.

క. చిరకాల శిక్షితులు చి
త్తరువుల వ్రాయఁగల రేమొ తత్తత్సుమముల్
పరిమళము వాని కెటు చే
కుఱు నెటు మధు వచటఁ దేంట్లు గ్రోలఁగ దొరకున్.

చ. విపుల తరంగ సంహతుల వెల్లున సాగర మేఁగు నీనదిన్
జపలమృగమ్ములార నగసంశ్రితలార డిగం దలంతురే
యపరిమి తోచ్చలాంబునివహ భ్రమ దూఁకఁగ నక్ర మిప్పుడే
ద్విపపతిఁ బట్టి గిఱ్ఱుమని త్రిప్పి రసాతలమంట నీడిచెన్.

క. అటువంటి తామరల విడి
కుటజములకుఁ గూర్తు వంతకును జీవన సం
పుటి వయ్యుఁ బ్రబల వాయువు
లెటువీచిన నట్ల పోదువేమి పయోదా.

చ. మతిచెడి చేయిజాఱి జలమధ్యమునం బడెఁ ద్రెడ్డు దారి ప
ర్వతములఁ బట్టి మబ్బు మఱి పట్టెను మిన్నున నౌక బ్రద్దలై
చతికిలనుండె దాఁటుటకు సాధ్యమె సాగర మింక ముంచెదో
యుతమిడి యొడ్డు చేర్చెదవో యున్నవి నీకయి రెండు మారుతా.

క. పరగుణముల భాసించునె
నరుఁ డాత్మీయంబులగు గుణంబులఁ గాకన్
బరిమళమునఁ గా కెటు వి
స్తరిల్లుఁ గస్తురిప్రశస్తి శపథముచేతన్.

చ. పలుకు వెలందిపట్టణముభాగ్యము దోఁచిన వారి మ్రోల వా
జ్నిలయన నిర్గళ త్కణ కణీయులు మూఢులు త్రుళ్లుచో నిఁకన్
బులుఁగుల పిల్ల లుగ్రఫణిమూర్ధమునన్ మృగనాథు మాళిన
క్కలుఁ గరి నెత్తి ముంగిసలుఁ గా లిడు లీలగ నేఁట రేపటన్.

క. అడుగక యె యిచ్చు నెంతగ
నడిగిన సుఖమొసఁగ దున్న దంతయుఁ గూడం
దుడిచి మఱి పెట్టు విధి యె
క్కడి యుచ్ఛృంఖల బలాధికమ్మో యెఱుఁగన్.

క. పాలుం బలె నా చేసిన
మే లంతయు నిర్భయముగ మ్రింగియు నన్నే
కాలుని ప్రోలికిఁ బంపం
గాలవ్యాళానుజుండు ఖలుఁడు యతించెన్.

క. పరహితము యాత్మజీవన
పరమార్థము చేసి బ్రదుకు వారి పలుకు లె
ల్లర కాపాత కటుత గల
పరమౌషధముల విధానఁ బథ్యమ్ము లగున్.

చ. జడిమ నడంచుఁ జిత్తము బ్రసన్న మొనర్చును బూర్వపాపపున్
జడధులు పుక్కిలించుఁ గరుణామతిఁ బ్రోదిడు నెల్లప్రాణులన్
జెడుఁగు లడంచు నాపదలఁ జిక్కిన వేళ నిఁకే శుభమ్ములం
బడయఁగ రా దహో సుగుణవంతుల స్నేహము గల్గు వారికిన్.

క. అకట రజోవతి మఱి కం
టకబంధుర పాండువర్ణ నాక యిటులఁ గే
తకిఁ దవిలితి మధుకర నీ
మొకమున కే మైన సిగ్గుబొగ్గును లేదే.

చ. వనమున నాడుకొంచు శశబాలకుఁ గాంచి భయమ్ము తోడ మున్
దన విభు బాహు వండగొని దాఁగెడు సీత మహోగ్ర రాక్షసా
గ్రణి హృతయై కటా నుడువరాని విపద్దశఁ జిక్కె నేఁ డిటుల్
దనుజులు తీవ్రలాంగలపు దంష్ట్రల వా రటు చుట్టుముట్టఁగాన్.

క. ఎంత మహా వేదాంత ని
శాంతుఁ డగుంగాక ఖలుఁడు సాదగునొక్కో
సుంతయిన మెత్తవడునొకొ
యెంతగ మైనాక మబ్ధి నెడపక యున్నన్.

క. ఖలుని వశపఱుప నెవ్వఁడు
దలఁచె నతఁడు హాలహాలమ్ము ద్రావెను గాలా
నలుఁ జుంబించెను గవుఁగిఁటి
కెలయించెం గోడెత్రాఁచు నీ క్షితి లోనన్.

చ. కనలి యులూకముల్ నిజనఖంబులఁ బక్షము లూడ్చ్చిరన్ విడన్
జనవు పురీష పుష్ట వపుషంబులు పక్షులు కొన్ని స్వాశ్రయం
బనిమిష వాః ప్రవాహ జలమైన విధుం గలుషించె నేనిఁ బా
వన ఝరిణీ మృణాళ లవ భాజన భోజన రాజహంసముల్.

క. కోఁతుల పేరోలగమం
దాతత తరు శాఖలే మహాసనములు ది
వ్యాతిథ్యము నఖ దంతా
ఘాతము ఛీత్కృతము లౌర కలభాషణముల్.

క. మర్కట గళమ్మునం దొక మందబుద్ధి
మంచిముత్యాల హార మర్పించె నదియు
నాకి మూర్కొని హారమ్ము నలిపి ముద్ద
చేసి చేసికొనియె నున్నతాసనమ్ము.

ఉ. అంకుశ తీవ్ర ఘాతముల కొఁదల నొగ్గుచుఁ గట్టుఁగంబపుల్
సంకెల బందిజీవనము సల్పుచు మావటి కాలి తొఁపులన్
జంకెనలన్ మృగాధిపతి సైఁచినచో నిఁక భూమిపాల సౌ
ధాంకణ సీమలం గనఁగ నౌనెటు మత్త మతంగ యూథముల్.

క. తానమ్ము లేని రాగము
దాన కళా హీనమైన దంతీంద్రమ్మున్
మానమ్ము లేని నృపతియు
జ్ఞానమునకుఁ గాని ముని ప్రకాశింగనునే.

క. బడబడఁ బండితు నోటన్
వెడలవు నుడు లొక్కవేళ వెడలిన మఱలం
బడ వెట్టివేళ నేనిక
పడవాలుని వదన దంత పంక్తి విధమునన్.

క. హరి రాజాస్థానులఁ బం
జరమున నుదరిపడుఁ బౌరుషము మొనవోవన్
గర జార్పణోత్సవ మ్మెఁక
జరుపు నెవం డున్మిషద్గజ కపోలములన్.

చ. కుడువుము పాలు నిద్రగయికొమ్ము మదేభ మటంచు నీవు న
ల్గడల రుషా కషాయ చటులంబగు దృష్టి నిగిడ్చెదేల యీ
తఁడు భువనత్రయీ హృదయ తాప మడంచు ఘనుండు మేఘుఁ డీ
యుడిగము కోసమే యుఱుముచుండె నదే మెలమెల్లఁ బోతమా.

క. నతుల మృదువచనముల స
న్మతులను నమ్మించి వంచనము చేయు దురా
గతుల సయితము భరించెదు
మతిపోయెనె నీకుఁగూడ మాత ధరిత్రీ.

చ. ఎద నలయించు తృష్ణఁ బరువెత్తు సముద్ర తటాక వాపికా
నదుల జలాభిలాష మెయి నారద యన్యములౌ విహంగముల్
పెదవులు గొంతు నెండినను వేఁడదు చూడదు వాని నెప్డుఁ జే
రదు శిశువయ్యుఁ జాతకము బ్రామిక చూపదు లోఁ దలంపదున్.

క. తన వాడిగోళ్ల బాల్యం
బుననే మదకరికపోలములఁ జీల్చు మృగేం
ద్రునకు నిజపౌరుషము యా
వనోత్సవము నం దిఁకెందుఁ బ్రకటింప నగున్.

క. హరిమందిర మరిగిన మద
కరికుంభస్థములు మౌక్తికంబులు దొరకున్
దొరకు నిఁక దూడతోఁకలు
ఖురచర్మంబులును నక్కకొంపకుఁ జేరన్.

చ. చిగిరిచి పూచినట్టి తరుశేఖరముం గని తీయమామిడిన్
నెగులున నారికేర మెద నీరయిపోయెను దాడిమీ ఫలం
బగిలె నెడంద నల్లవడె సొంతము నేరెడుపం డసూయచేఁ
బగగొనె నేమొ నా పనసపండును శూలము దాల్చె నక్కునన్.

క. కలరు బుధులందు జ్ఞానపుఁ
గళికలు యతులన్ విరక్తిగల వారలునుం
గలరు నరాకృతి జ్ఞాతులఁ
గలరు హాలాహలపు టగ్గిఁ గ్రక్కు దురాత్ముల్.

చ. మొలిచెను బీజముల్ లతలు పూచెను మ్రోడులునుం జిగిర్చె దుం
పలు మొలకెత్తె వల్లు లెగఁబ్రాఁకె ధరా ప్రజ సంతసించె నీ
జలదము వర్షముం గురియఁ జాచిన గొంతుక నొండు రెండు చి
న్కులు పడ వెట్టి పాపమునకున్ జనియించితో వానకోయిలా.

క. నిండినవానినె మఱిమఱి
నిండింతు పయోద యేమి నీ నడవడి నో
రెండి నినుఁ జేరెఁ జాతకి
కొండిక దాని కిడ వయ్యె గ్రుక్కెఁడు జలమున్.

చ. అటమట గాఁగఁ గృత్రిమ సటాంచల సంచయ మొప్ప శ్వానమున్
జటిలతరాంస భిత్తిగ నొనర్చి మృగేంద్రపదాన నిల్పినన్
సటయగుఁ గాని యుద్ధత గజ వ్రజ కుంభ తటీ విపాట నో
ద్భట సుభ టాయమాన హరి వైఖరి జాగిల మెట్లు గర్జిలున్.

క. ఉన్నత గజ కుంభముపైఁ
గన్నిడి జీవితము నడపు కంఠీరవ మా
సన్న మగుఁగాక హరిణముఁ
గన్నెత్తియుఁ గనునె కడుపు కక్కుఱితికై.

చ. మృగమదచర్చలన్ వలపు లీను లతాంగుల గబ్బిగుబ్బ చ
న్నొగడల నాట్యమాడు తెలిముత్తెపు హారము లందుఁ జేరియున్
ధగధగలాడు నో మరకతంబ యిటుల్ గురివెందపేర్ల దం
డ గలసి చెంచుకాంతల మెడం బడి వ్రేలఁగ నయ్యె నేఁ డయో.

క. త్రిచతుర జల కణములు వా
ర్ముచమును దప్పిగొని వానపులుఁ గడుసు జగ
త్ప్రచయ మది నీట ముంచును
విచిత్రముగ నుండుఁగాదె పెద్దల యీవుల్.

తే. సకల విశ్వంభరా ప్రదేశముల నెందుఁ
గమల మండిత మగు నీరు గలుగుఁ గాక
మానసము వీడి రాయంచ మానసంబు
రక్తి వహియింప దితర సరసుల యందు.

చ. హాలహాల వహ్నిఁ గ్రోలిన మహాత్ముఁడు శూలియు నీలకంఠుఁడే
జ్వలిత మహాహులం జిదిమి సాపడు నెమ్మియు నీలకంఠుఁడే
నల దళ సంగి కీటక గణమ్ము మెసంగెడి యూరపిచ్చుకా
యిలపయి నీలకంఠుఁడను నే ననుచుం దలపోయు చుంటివా.

తే. ఉఱిమి భయపెట్టు ముగ్రవాయువులు వీచి
గాసి నిడు మబ్బ మఱి వడగండ్ల మొత్తు
మీఁ విడు జలమ్ము గ్రుక్కెఁడు ద్రావి బ్రదుకు
చాతకమునకు నీకంటె శరణు లేరు.

ఉ. నాలుగు బొట్లు నీ జలము నా వదనమ్మున నింపుమా జగ
జ్జాలముఁ బ్రోచు ప్రేమగల దాతవు కూప నదీ నదమ్ములన్
దేలికసేసి నిన్ గొలుచు దీను నెఱుంగవె గీము వీడి నీ
పాలిఁటఁ బడ్డవాని నను బాలునిఁ జాతకపక్షి నంబుదా.

క. అనిమిషపతినందనమున
జనించి సుర తరు వర ప్రసవ మధు రస పా
రణ లగు తేఁటుల కిటు జీ
వనమయ్యెఁ గొడిసె పువులె ప్రారబ్ధమునన్.

చ. సిగనగ సేసికొందు దయసేయఁగదే యొక యీఁక యంచు నెం
తగ బతిమాలుకొన్నను వృథా యొనరించితి నా కొసంగుదే
పగగొని పట్టి ఱొమ్ముపయి వామపదం బిడుచున్ మయూరమా
పొగరున లాగి యొల్చుకొను బోయ కొసంగెదు గాక సర్వమున్.

క. ఘనుఁ డుఱుముచుఁ జల్లెడి వాః
కణములె గ్రహియించుఁ జాతకము దాత యెటుల్
పనవుచుఁ గాఱులు ప్రేలిన
ననన్యగతికులు గ్రహింతు రాశ్రితు లగుచున్.

ఉ. జాలరివాని క్రూరకరసంగతి దప్పియుఁ బాఱలేమిచే
జాలెము నందె చిక్కుకొని చల్లఁగ నచ్చటనుండి జాఱుచున్
నేలకు దూఁక దుష్టవిధి నేర్చు నయో యిఁక నేమిసెప్ప బే
తాళ మటుల్ బకం బొకఁడు దారి గుటుక్కున మ్రింగె మీనమున్.

క. వని వనగుత్తులఁ దిరుగుచుఁ
గనియును మూర్కొనదు సంపెఁగను నళి యది చ
క్కని పూవుగాదొ రసికత
తనకుఁ గొఱయొ యీశ్వరాజ్ఞ దాఁటఁ దరంబే.

క. శశిబింబము వీక్షింపని
కుశేశయిని జన్మ మెందుకుం గాని దగున్
శశిపుట్టుక యును వికసిత
కుశేశయినిఁ జూడకున్నఁ గొఱగాని దగున్.

క. జలదబుతు వరుగు నీ తి
ప్పలు గనుపడ నీను పొంగు పదటఁ గలయు నీ
కెలన మను తరులఁ గూల్చిన
కలుష మెుకఁడు నిల్చుఁ దటిని కలకాలమ్మున్.

చ. ఇలఁగల జీవరాసులకు నెక్కటి జీవనదాత వయ్యు నో
జలదుఁడ భీషణధ్వను లెసంగఁ జరించుచు రాజహంసలన్
విలవిలఁ బోవు నట్లు భయపెట్టె దయో విషయప్రవృత్తికిం
దొలఁగి చరించు టే యకట దోష మటంచుఁ దలంచి నాడవో.

క. కడుపార మధు విచలె సా
పడి కడపితి రాత్రు లపుడె ప్రాఁతవడెనె యి
ప్పుడు పద్మిని మంచున సిరి
గెడసె ననుచు దాని వంక కే చేర వళీ.

ఉ. నీరముఁ బాలు నేర్పఱుప నేర్చిన దానవు నీ వివేక మే
యూరికిఁ బోయె నిప్పుడు ఖగోత్తమ హంసవతంస యేల కా
సార జల ప్రసారమగు చంద్రకళం గనినంతనే బిసాం
కూర మటంచు దానిఁ గయికోఁ బరు వెత్తెదు రిత్తయాసలన్.

తే. ఏల యడియాస నర్తించె దిది మదాంధ
గజముగాని చాతక ఘనాఘనము గాదు
నిన్నుబోంట్లకు దాన మీ నేర దిది మ
తంగజము నీగి మధుపసంతతికె చుమ్ము.

క. ఎలమావి సరళమగు కో
కిలతో స్నేహమ్ము నీకుఁ గీలించిన య
న్నలువగదా నిందృఁడు నీ
క్రొల గలదే కాకి ప్రేలుకొను మీఁకఁ గాఋల్.

క. త్రావితి తీయనినీరము
నీవు మరాళంబ బిసములెల్ల మెసవి తా
సేవించితి తామరపూ
లీవే మిడి యీ సరసుని ఋణ మీఁగెదవో.

చ. మొగమెదు టిచ్చకమ్ములకుఁ బోవు ధనాఢ్యు లటంచు వారి నె
మ్మొగములు మాటికిం దడవఁబోవు తదీయ దురుక్తు లాలకిం
పఁగఁ జన వాస వారిబడిఁ బర్వులు వెట్టవు వేళ కింత పూ
రి గఱచి వేళ కింత నిమరింతు కురంగమ యే తపస్వివో.

క. వనదా నీ వాసఁగెడి వాః
కణములకయి రాదు చాతకము సరసుఁడవుగా
ఘనుఁడవని యున్నతుఁడవని
చనుదెంచెనుగాని లేవె జలజాకరముల్.

చ. హరియని భేకమర్కటము లంబర మంచును నాకసంబు శ
ర్కరయని పల్గుఱాయి భుజగంబని భోగి యటంచు సర్పముల్
గరిమదవారి దానమని కాకి ద్విజాఖ్య ధరించు నట్లె కొం
దఱు ధరియింత్రు నామములు దంభముగా ఘృతకోశతుల్యముల్.

తే. ఖండితాలోచ నాబ్జ వికాస నైక
పాండితీ శౌండములు దిశాప్రాంత దివ్య
మండనములు విభాసిల్లుఁ జండ భాను
మండల ప్రోత్థితము లంశుమండలములు.

క. నీరజినుల మరగియుఁ బైఁ
గోరెదు తీరజములైన కుటజమ్ముల ని
ప్పేరీతి విడెదు మధుప మ
హారాజా నీకు సాజమగు చాపలముల్.

తే. వెండి బంగారు కొండల యండ నెన్ని
తరము లున్నను నచ్చటి తరులు తరులె
మలయమ గిరీంద్రమందుఁ దన్ గొలుచు కుటజ
నింబ కంకాలములఁ జందనించుచుండు.

క. మధుఋతువు ద్విరేఫమ్మును
మధురవచను ద్విజుని నొక్కమాదిరిఁ గను నె
వ్విధి జాతిహీనునకు నగు
బుధుగుణములు నధము దోషములు గుఱుతింపన్.

ఉ. హంసము కంక వాయస బకాది ఖగమ్ములఁ జేరె నొక్క సా
యం సమయమ్మునం దన ప్రయాణపు సొక్కు నడంప నంత నా
హింసకజాతిపక్షు లిహిహీ యిది మూఁగ యటంచుఁ బక్ష వి
ధ్వంస మొనర్చె నున్నతుల పాటు లివే యధమాశ్రయమ్ములన్.

క. తన యిచ్చకువచ్చిన య
ట్లనురాగ విహార వశత నందం దూరే
గును గాక మలినమతి వీఁ
డని యళివల్లభుని మఱువ దబ్జిని యెడఁదన్.

క. ఉద్యాన వనాశా ప్రళ
యోద్యమ మగు మోదుగెంతయున్నతి గన్నన్
సద్యః పల్లవ సుమ ఫల
హృద్యమయిన నందు చిలుక లేమి యొనర్చున్.

క. తెలివి గలవు సుమ పల్లవ
దళ భాగ్యమె తెల్పు రిక్తత గ్రహించియు నే
ఫలమున కుపవనిఁ దిరిగెను
చెలువుఁడ పండినను వేప చేఁదే కాదా.

క. బక కాక కోక మండుక
వృకసంతతులార మ్రొక్కి వేఁడెద మిమ్మిం
చుక మీ కొలకొల లాఁగుడు
పికము మనోజ్ఞముగఁ గూఁతపెట్టుచు నుండెన్.

ఉ. ఏణగణమ్ములున్ నెమిళు లీశశ శల్యక జాతి గుంపు లే
కోణమునందో యేదియొ నికుంజమునం బడియుండు నెండకుం
ద్రాణ నశించి తన్ దఱియు దంతికులేంద్రము నిల్వ నీడయై
రాణువ మిన్నుదాఁకు తరురాజము జన్మమె ధన్య మన్నిటన్.

క. కుల శీల రూప రేఖా
కలనమునం దెందు ఘనత గన్పడ దైనన్
గలకాలముఁ బ్రోచెద వీ
యళికుల మంబుజమ నీ మహాత్త్వ మదియె కా.

చ. అడవులఁ బూరి మేయుచు విహార మొనర్చెడి లేళ్ల నాభులం
దిడి మృగనాభి తద్వధకు హేతు వొనర్చె వృథా విధాత యా
జడమతి యట్లుగాక ఖలసంతతి నాల్కల మూలభాగమం
దిడినయెడన్ బ్రపంచమున కెంతటిమేలు ఘటించి యుండునో.

తే. ఇచ్చవచ్చినట్టు లెల్లెడ నీ తోడి
పులుఁగులెల్లఁ బ్రొద్దుపుచ్చుకొనఁగఁ
బాంజరమున నీవు బందివడితి రామ
చిలుక పలుకుతీపి ఫల మిది గద.

క. మెడజూలు విదల్చక బొ
బ్బిడకయె హరి శోభసేయు నిలతాల్చిన కె
వ్వడువున నెంతగ గర్జల
నిడినను జేయంగ వశమె యేనుంగునకున్.

క. బిసకందమ్ముల మెసవెడు
బిసినీ దళ పంక్తియందు విహరింతు మహో
ల్లసమున హృదయంగమ మా
రస మిపుడు త్యజించెదేల రాజమరాళా.

చ. చలువలు పుట్టు జాడ ద్విజసంతతి కాఁపురముండు మేడ పాం
థులకును నిల్వ నీడ గుణతోయము లుండెడి వాడ భూరుహం
బులకును ఱేఁడటంచుఁ దలపోసి తరూత్తమ నీదు నీడలో
నిలువఁ ద్వదీయ కోటర ఫణి వ్రజమే యెడసేసె మమ్మిటుల్

క. మల్లీలతికల మాలతి
వల్లుల నెల్లపుడుఁ దిరుగవచ్చునుగా కీ
వల్లడి సంపెఁగవనిలో
నుల్లసమునఁ జెల్మిసేయు కోమధుకరుఁడా.

మ. ఒకచోటన్ జనియించినాము కొలనం దున్నాము కొన్నాళ్లు లో
వికచాంభోజమ నీవు నేన్ గలిసియే విచ్చిత్ర మీవీగతిన్
జకితాక్షీ శ్రవణావతంస మయిపో శైవాలమై యొందు నో
పక నేఁ దేలుచునుందుఁ బామర వధూ పాదాహతాంభస్సులన్.

క. మానధనుఁ డెంచు మరణం
బైన వలచుఁగాని విడువఁ డాత్మోన్నతి ని
ర్యాణం బొందిన నొంపుం
గాని హుతాశనుఁడు శీతకరుఁడగునొక్కో.

తే. బుడుతతనమాదిఁ బెదిగ నీకడుపులోన
నెడఁద నీ జీవనసమృద్ధి కెలమిఁబొందె
జీవనము దీని దిఁక నీవు జీవనంబు
తోనసరి యెట్లు బ్రతుకు నీ మీను కొలఁక.

క. ఘనుఁడా నీ జీవన మి
మ్మని చాతకపక్షివోలె యాచింపను నీ
ధ్వనిమాత్రమునకె తృప్తిం
గని బ్రదుకుచు నుండు నీలకంఠుఁడఁ గాదా.

చ. ఇలఁగల తాపమెల్ల హరియించి పయస్సుల ముంచివైతు భూ
ముల మొలిపింతు విప్పలకు మొగ్గలు దొడ్గెదు కన్నులెల్ల మి
న్నులపయి నిల్పి నీకొఱకు నోఁచెడి చాతకపక్షి నోటిలోఁ
జిలుకవు బిందువేని యది చేసిన నేరమ దేమి నీరదా.

తే. గజము దానార్థులగు తేంట్లఁ గంఠకావ
రమునఁ జెవిగాలి విసరి దూరముగఁ గొట్టె
నది తన కపోలకాంతికే హాని గాని
మధుకరులకేమి విచ్చుదామరలఁ జేసు.

చ. ఎటు శరణమ్ము లేక వటియించుచు శోషిలిపోయెఁ గాఱు చి
చ్చుటమటఁ జాతకమ్ము దగ నార్పఁగ గ్రుక్కెఁడు నీళ్లు నీ వొసం
గుట కరుదేర నిడ్డె ప్రతికూలపు వాయువు దాపరించెనా
యెటుచనె దీవు నీ యుదక మెక్కడ చాతక మేడ మేఘుఁడా.

క. కాచినఁ గోసిన ఱాతన్
రాచినఁ జింతలదు కాంచనము తన్నుఁ దులన్
వైచుచు గురిగింజలతోఁ
దూఁచుట గని మాత్ర మాత్మ దుఃఖించుఁ గడున్.

క. శరదంబుధరం బుఱుమున్
గురియదు వర్షాంబుదమ్ము గురియు నుఱుమ దీ
ధర నీచుఁ డీయఁ డఱచును
సరసు డఱువఁ డిచ్చు సర్వసమయములందున్.

క. కళకాంతుల నెలవని శుచి
కులుఁడని శశి నెత్తినుంచుకొనె శంకరుఁడే
నళిని జగత్కాంతు నితని
పొలపముగని మొగము నేల ముడుచుకొనెదవే.

ఉ. ఓయి చకోరమా మెదలకుండుము రాచిలుకా ప్రసంగముం
బాయుము నోరువిప్పకుము బర్హిణమా యిఁకఁ బావురంబ నీ
కూయట చాలదే పికము క్రొంజివురాకుల విందు లానుచున్
హాయిగఁ బాడుచుండె శ్రవణామృతపంచమనిస్స్వనమ్ములన్.

క. ఇది పారిజాతమని యెం
తదనుక గుఱుతింప దంతదాఁకను బొదరుం
బొదరుం జెట్టును జెట్టును
మది నాఁపఁగలేక తిరుగు మధుకరుఁ డకటా.

చ. శుక మొకఁ డావులించుతఱిఁ జొచ్చెను జంచుపుటాంతరమ్ముఁ గిం
శుకమనుకొంచుఁ దేఁటి తన క్షుత్తు నడంప నిఁ కేమి సెప్ప నం
గకములు నొత్తడిం బడఁ బొకాలుచుఁ దేనియ యాసకుం దిలో
దకమిడి యెట్లొ బైటపడి తప్పుకొనం దలపోసె నక్కటా.

క. ఫలియించు నెప్పుడోయని
నిలువకుమీ కింశుకమున నీ వొక లెక్కా
యిల నెందఱెంద ఱీపయి
వెలుఁగులు గని మోసపోరు వెంగలిచిలుకా.

చ. శ్రమపడి శేవగ ళ్లోక కిసాల లవమ్మున కాసనేసి కం
ఠ మెరియఁ గూయుచుంటివె కటా పికబాలక యీ రసాలభూ
జము ఫలమిచ్చునే రసవిచారణపూర్వము దీనికెందుఁ గా
కమయినఁ బాంథుఁడైనఁ గపిగాఁడయినన్ బికమైన నొక్కటే.

తే. పరిచయం బెక్కువైనచోఁ బరువుపోవు
నిరతగమనమ్ముచేత నాదరము తఱుఁగు
గంధగిరి నుండెడి కిరాతకాంత వంట
చెఱుకుగా వాడు గంధపుఁజెక్కలెల్ల.

చ. మహిపతు లిచ్చినట్టి చనుమానమునన్ బికపంక్తిఁ జేరి దు
స్సహములు వాయసమ్ములు రసాల మరంద రసమ్ము ద్రావుఁ గా
కహామికచే వసంతసమయం బరుదేరఁగఁ బంచమశ్రుతిం
గుహుకుహునాదముం బలుకఁగూడునె కర్ణరసాయనంబుగన్.

క. పరుని ప్రతిష్ఠాగ్ని నిరం
తరోగ్రమై తన్నుఁగాల్పఁ దత్పదమందన్
నెఱి చాలని నీచుఁడు త
త్పరోక్షమం దెగ్గులాడఁ బ్రయతించు నోహోహో.

చ. కొలఁకులనుం బ్రవాహములఁ గుంటలఁ జెర్వులలోని నీరమున్
జలధరమా త్యజించి నినుఁ జాతక మింతగ నాశ్రయించినం
దులకు ఫలమ్మిదా శిరము నుగ్గుగ ఱాల్గురియించి వైద్యుతా
గ్నుల జళిపించి గర్జిలుచునుం బిడుగుల్ పడవైచుచుంటివా.

క. చిలుకముకుపుటము దూఱెన్
బలాశకుసుమమను భ్రాంతి బంభర మదియున్
గొలగొల దానిని జంబూ
ఫలమని గుటుకుమని మ్రింగ భావించెనదన్.

చ. సలలిత పల్లవ ప్రసవ చారు ఫలమ్ముల నెల్లభూజముల్
విలసిలుచుండ నీయుదయవేళ నిదేమి టోహోహో వసంతమా
నులుసులమైన మాకుఁ గొఱనోములు నోఁచిన రేఁగుఁ జెట్లకుం
గళితములయ్యెఁ బండ్లు చిరకాలశిఖాతతి లూనమై చనెన్.

క. సుముఖ మగుఁగాక సన్మా
ర్గమునం బడియుండుఁగాక కంటకము సువృ
త్తముతోడ నున్నతుల పా
దము లంటునుగాక యది వ్యథాకారియెకా.

చ. అల తరు వున్నతంబు ఫలమా కడు గొప్పదటంచుఁ జూచి తె
క్కలెగయ నోటఁగల్గు వరికంకి త్యజించియు నారికేర మా
కలిమెయి నెక్కి రాచిలుక కాయ పగుల్ప యతింప నాసయే
నలినలియాటగాదు తన నాసయు నూడెను నుగ్గునూచమై.

క. ఉన్నతి కలుగుట గుణసం
పన్నతచేఁగాని జాతిమాత్రమ్మునఁ గా
దౌన్నత్యము పయసాన్నిధి
కన్నంతనె హాలహాలమ్ము కనఁగల్గునొకో.

చ. లలిత పయోద నీలతనులాభము నొందిన నొందుఁగాక స
త్ఫలరస మానుఁగాక మఱి బాల రసాలవనీ విహారముల్
సలుపునుగాక కోకిలకలాపములన్నియుఁ జూపుఁగాక త
త్కలరవపంచమ శ్రుతిసుఖస్థితిఁ గాకము కాకమేకదా.

క. కరివరమదాంబుసేవా
భిరతి నళీ యీ దినములు వెడలింపుము త
త్కరి నిశితకర్ణతాడము
నెరపిన నవనవ సరోజినికడకుఁ జనుమా.

క. సరసులకుఁ గలవె కమలా
భరణలకును రాజహంసభాసురలకు నీ
గురుగర్వమేమి చాతకి
పరుగిడుఁ బౌరందరీయవాఃకణములకే.

క. ఇదె హేమంతము మాధవ
మిదెయని యిరుదారల నడుమ నెటుదోఁచని తు
మ్మెద కుందము మాకందము
గదిసియు రెండింట నెందుఁ గాలిడదుగదా.

ఉ. కారున నీకు సమ్ముఖముగా నిజచంచుపుటమ్మునెత్తి యా
ధారములేని మింటఁ దన దప్పిక దీర్పఁ జిరమ్ముఁ జాతకం
బూరకనిల్చె నీ యిడు మహాహ్లాదకణమ్ముల మాటటుండనీ
నారదమా భవన్మధురనాదముగూడ వినంగనోఁచదో.

తే. ఓ సరోజమ రేకులు మూసికొనియు
నీవు లోనికిఁ దేఁటి రానీయవేనిఁ
దక్కవేమగు దాని కుద్యానవీథిఁ
జిగురిడిన లేఁతమామిడిచెట్లు లేవె.

చ. ఒడలు మలీమసైక మదియుం బరపుష్టము సంతతమ్ము నీ
యడవి శకుంతసంగతి విహార మొనర్చెద వే విహంగ మీ
వడువున శ్రోత్రపేయమగు వాక్సుధ వీనులనింపు విద్య నీ
కిడిరె శకుంతమా నుడువుమీ కలపంచమనాదవంతమా.

క. చండాంశు మండుటెండల
నెండి నవయు నీ మహా మహీరుహముల కి
న్దండ యెవఁ డయ్యెయో మే
ఘుం డీజగమేది వార్ధిఁ గురియుచునుండన్.

క. నిశలందున ఖద్యోతము
శశాంకుఁ డుదయించుదాఁకఁ జక్కఁగ వెలుఁగున్
శశిఖద్యోతుల తేజము
నశించు నహిమాంశు డుదయనగమెక్కినచోన్.

తే. చెలిమిధర్మ మెఱుఁగరు బోయలు మృగమ్ము
లా పశువు లిందు నాగరుల్ రారు ఋషులు
రాగరహితులు ధూమసౌరభము దిశల
బుగులుకొనఁ గాలె నయరొ యీ భూరుహమ్ము.

చ. పసిరిక మేసి మంద్రగిరి పజ్జ నెమర్చుచు నిద్రవోవుమా
విసువు దొలంగినన్ దిరుగు స్వేచ్ఛగ నంతియెకాని మమ్మయో
రుసులను జూచి నిర్గళితరోషులఁ బామరమూఁక చూచిన
ట్లసురసురై వృథా భయము నందెద వేల కురంగబాలకా.

క. చిలువలు మూలము శిఖరము
పులుఁగులు కొమ్మలు ప్లవంగములు తేఁటులు పు
వ్వులు పార్శ్వ మేనికలు మృగ
ములు కరణము గంధభూజమును సేవించున్.

చ. హిమపటలం బడంచు హరియించుఁదమస్సు వికాసమిచ్చుఁ బ
ద్మములకు చక్రవాకములఁ దార్చి సుఖంబిడు కన్ను ప్రాణిలో
కమునకు వ్యాపకుండు త్రిజగంబుల నాతనికే స్థిరమ్ముగా
సమకుఱ దొక్కచో నిలువ సాగునొకో విధిఁదాఁట నేరికిన్.

క. వాయసముల హంసము గో
మాయువులన్ హరి ఖరమ్ములందున నాజా
నేయమ్మును నిజకాంతిం
బాయు నిరక్షరుల నడుమఁ బండితుఁడు బలెన్.

క. సుమతులగోష్ఠిం బెద్దటి
కము గల్గునె కొండెకాఁడ కలకంఠపదం
బమరునె రసాలశిఖరా
గ్రమెక్కి కూర్చున్నమాత్రఁ గాకమ్మనకున్.

క. ఫలదళములకై చూతము
పులుఁగు లనేకములు వచ్చిపోవుచు నుండుం
గలకూజితమున నొక కో
కిలమాత్రము నీపరోపకృతి కీర్తించున్.

ఉ. ఎందఱులేరు రాజులు మహిం దమమిత్రుల భాగ్యవంతులన్
బందుగులైనవారి బలవంతులఁ బ్రోచెడివారు వారి నేఁ
గొందునె దూరవాసులఁ జకోరుల సూర్యకరాభితప్తులం
జందనశీతలద్యుతుల సాఁకునతం డగుఁగాక రాజిలన్.

తే. మధురసం బెల్లెడల జాఱె మంటఁగలసె
నాకులన్నియు మారుతాహతుల రాలె
నిప్పటికిఁగూడ మాధవి నీవు మధుప
యక్కటా పట్టుకొని వ్రేలుకాఁడె దేల.

చ. స్తనములుమాత్రమేది మెయి సొంతముమాంసము నొల్చుకొమ్ము నన్
బనువు మనుగ్రహింపు మిదె వాగురికా పనిగొమ్ము పోయెదన్
గను లటు విప్పి నేఁటికిని ఘాసము గుప్పెడు నోటఁబట్టఁ గా
నని పసిబిడ్డ లింటికడ నా చను మార్గము గాచియుండెడిన్.

క. హరిణాంక నిన్ను సాటి
త్పరమేశ్వరుఁ డెంత నెత్తిపై నిడుకొన్నన్
నిరతముఁ గృశించుచుందువు
పరాశ్రయం బెంత కష్టభాజన మకటా.

క. అతిమాన మణీ భాగ్య
స్థితి గలిగియు నబ్ధివిభుఁడు చెందఁడు మదమున్
గతిపయముక్తా రత్న
ప్రతిపత్తికె యెంతమదము పట్టెఁ గరులకున్.

క. ఫల దళ రహస్య వేదులు
కలిగినఁ గలుగుదురు గాక గణుతింపఁగ ని
య్యళివిడి మధు మర్మ కలా
కలాపుఁ డగు వాఁడు గలఁడె కలికమ్మునకేన్.

చ. ఇఁక గహనోపకంఠ మిది యిప్పుడె వీడుము దిక్కు లన్నియున్
బుగులుకొనం బకీమళము పొంపిరివోవఁగ నీకు కీర్తులుం
బొగడిక లుండని మ్మచట బోయల శాతశరాభిఘాతపున్
నెగులు హరించు వాఁ డెవఁడు నీ కిఁకఁ గస్తురికాకురంగమా.

క. తరు ణేందు కల సరస నిను
శిరమున భూతపతి చేర్పఁ జెడునె తమము ధు
త్తురధూర్త కలువ విరియునె
కరఁగునె శశికాంత మబ్ధి గనునే వృద్ధిన్.

చ. కలయ జలంబులన్ విసముగల్పియు గోఁతులు ద్రవ్వి యెల్లెడన్
వలలిడి యేమిసెప్ప నలువంక వనమ్మునఁ జిచ్చువెట్టి యే
నెలవునఁ జాపహస్తులయి నిల్చిరి చెంచులు నందచేరె బి
డ్డలు తను వెంబడింప నకటా దరిలేని కురంగి దుర్విధిన్.

క. పొగరెక్కి చక్రవాకము
లగడు లఱచుమాత్ర నేమియగు నీ దయకుం
దగి బ్రతుకు చకోరుల కీ
జగమందునఁ గఱవుగలదె శార్వరినాథా.

క. పామరులు పంకమను బ్రమ
చే మృగమదమా నినుం ద్యజించిరె యనుచున్
నీ మదిఁ దలఁపకు మెందఱు
భూమీంద్రులులేరు రసికమూర్ధన్యు లిలన్.

క. స్థానమునుండి నక్ర
మ్మేనుంగునుగూడ బయటికీడ్వఁగఁ జాలున్
స్థానభ్రష్టగునెడ నది
శ్వానముచేతను బరాభవంబే పొందున్.

చ. సహజను లిందిరాసురకుజప్రముఖమ్ములు నాత్మసూతికా
గృహము పయఃపయోధి నిజవృత్తి చరాచరమోదమున్ సుధా
మహితము బింబ మట్టి గుణమాన్యు మహోదయమందు నీవనీ
రుహము వహించు సంకుచితరూపమె నింద్యము నింద్యుఁడిందుఁడా.

క. లలిత పరిమళ మిళ దళి
కుల దళిత దళమ్ము వృక్షకుల మరుదుగదా
యిలపయి శాఖాశతశత
ములు వేలకువే లరణ్యమునలేవె తరుల్.

చ. కువలయినీగణమ్ము నినుఁ గోడిగమాడనిదాఁక లోకబం
ధువు కరముల్ నిగిడ్చి మెయిదువ్వి పరామరిశించుదాఁక నీ
నవ మధు వైభవైక పరిణాహము సాగెడుదాఁక నీ మధు
ద్రవమునఁ దేంట్ల కబ్బమ యథామతి విందులు చేయుచుండుమా.

క. అహిమాంశు వేఁడిమికి దవ
దహనుని కాఁకకును వాడి తప్తములగు నీ
గహనమయూరము లంబుద
స్పృహ గల్గి బ్రదుకుఁ ద్వదంబుసేచనమహిమన్.

క. ఋతుసమయ కుసుమితము లగు
క్షితిజాతము లెన్ని లేవు చెపుమ యశోక
క్షితిజమునకు బలె దేనికి
క్షితి నీదృశదోహదమ్ము చేయుదురు జనుల్.

క. మలయాచల సంసర్గము
గలమాత్రన బొంగు లెట్లు గంధపుతరులౌ
కలుగునె రసోదయము లో
పల సారములేని పగటిభాగవతులకున్.

చ. రవి చరమాచలాగ్రశిఖరంబున వహ్నిశిఖాళి నిల్వఁగాఁ
జవి గొనఁగా మరందమును సారసగర్భము దూఱెఁ దేఁటి సం
జ వడిన యంతలోఁ గలుగు సంకటముం గనఁ బోకయే కటా
యవని ఫలార్థులౌ రసవిహారు లపాయము లాత్మ నెంతురే.

తే. వీచికాగర్జనల వెఱపింతు వేల
కడలి పడియుందు మిఁక నోరు గట్టిపెట్టి
యీ తెరువరి నీ దరినె నో రెండి చిన్న
పడియకొలఁకేఁగె నీ కెట్లు పరువులేదు.

చ. పరిమృదితైకభిత్తి నొక ప్రక్క నెదో జనియించి నీవు బం
గరువునకున్ సమానమగు కాంచననామము దాల్చి మెల్లగా
నరిపురభేది రత్నమకుటాగ్రము నెక్కి కలానిధిం దిర
స్కరణ మొనర్తు ధుత్తుర విచార మొనర్పవె పూర్వవృత్తమున్.

క. హరి మాంసరుచి మరగి నినుఁ
దొలఁగిన గురివెందసరులదొరలు కిరాతుల్
సరకుగొనకున్న నీ ధర
తఱుఁగునె కరికుంభసంగతమ ముత్యంబా.

మ. మహితంబుల్ సయిఁచెం బరార్థమునకై మంథానమర్మవ్యథా
బహుళంబుల్ తనమేర దప్ప దవురా వాత్యాహతంబయ్యునున్
మహిభృత్సంతతిఁ గుక్షిఁదాల్చు జగముల్ మంచున్ జలంబిచ్చి తా
నహహా దీనఁగదా సముద్రమహిమం బన్నింటి మీఁదై చనెన్.

క. క్రొంచెము పంచమ మాలా
పించుము మౌనంబు పికమ విడు కాదే గు
ర్తించునెవఁడు నిను వాయస
సంచయసంపిహితమగు రసాలమ్మందున్.

చ. అమృతమువోని తేనియ నిరంతరమానుచు దేని క్రోడభా
గమున నిశీథివేళల సుఖమ్ముగ నొత్తిలి కన్నుమోడ్చి తా
కమలిని నీ పయిన్ మనసు గల్గినదానిఁ దలంతె యిప్పుడో
భ్రమరమ దిక్కులెల్లఁ దెగఁబాఱి లతాశతలంపటుండవై.

క. అమరేశ్వరు దిఙ్ముఖమున
హిమకరుఁ డుదయించెఁ జూడవేమొ భ్రమరమా
కమలిని మొగము ముడుచుకొనె
శ్రమపడి నీ వింతదవ్వుఁ జనుదెంచితయో.

చ. కమలదళాశ్రయం బొకఁడు కల్గెఁగదాయని నీవుగూడ ము
త్యములను భ్రాంతిగొల్పెదు యథార్థపు ముత్తెపుడంబుదాల్చి హ
స్తమునఁ బరీక్షసేయుటకుఁ దార్పు యథాయథలౌదు నీకు ము
త్తెములన నంతమచ్చరము దేనికి వారికణంబ చెప్పుమా.

క. రవిమండు టెండ కెండన్
దవదహనజ్వాలఁ బిదప దగ్ధములయ్యెన్
భవదంబుసేకమునఁ బున
రవతారం బెత్తు జలదమా యీ తరువుల్.

క. పరిమితనీరమె కుంభము
భరించుఁ గుంభజుఁడు క్రోలె వారాన్నిధియే
వరజని యొక్కొకఁ డిటు నిజ
చరితమ్మున మించు నాత్మజనకునిగూడన్.

తే. అంతిపురి రాచిలుక యాఁగ నాఁగె దగుగ
నరిగె దీక్షింప నీక్షింతు వారరత్న
భిత్తిమాటున సకల మబ్బినదిగాని
యది పలుకఁ బల్కు వేమి ఛాయాశుకంబ.

చ. ఉఱిమియుఁదా నొసంగుజల మొక్కొకబొట్టదిగూడ నెందొ యే
తరుణమునందొ యాగితఱిఁ దారొ్కనుఁగావిరి మేన మీఁదఁ బాం
డురము ఘటిల్లు నాపయిఁగడుంగడు లాఘవ మొందు మేఘుఁడీ
ధర నొకదాతయే ప్రభువతంసమ వీరనృపాలహంసమా.

క. దోసిటఁగల కుసుమంబులు
వాసించుం గేలుదోయి వహ్వా సుమనో
రాసిక్యము కుడియెడమల
వాసించుచునుండుఁ బక్షపాతములేకే.

ఉ. ఈవు చతుష్పథాన జనియించిన యందుల కిట్టి నీడకుం
దావలమైన కల్మికిటు దట్టముగా ఫలియించు దానికిఁ
నీవు భరింపఁగా వలె వనీజమ దారిన పోవు నెల్ల రె
ళ్లె విధి నీ శిఖల్ పిడికిలించిన వంచినఁ బండ్లురాల్చినన్.

క. బందింబడియుండియు వే
మందిని భరియింపఁ జాలు మదకరి శ్వానం
బెందును స్వేచ్ఛగఁ దిరిగియుఁ
గుందు మొగమువాఁచి పొట్టకూటికిఁగూడన్.

క. నీ యున్నతియును నమ్రత
ఛాయా కిసల ప్రసూన సంపదయు వృథా
నీయొద్దఁ గలవె పథిక జ
నాయాసంబుడుపు ఫలము లకట యశోకా.

క. పాణిని యైనను గౌతముఁ
డైనఁ బరాశరుని కొడుకు వ్యాసుండయినన్
నేను దలవంచి మ్రొక్కఁగఁ
బో నతఁడు కవిత్వ తత్త్వ మూర్ఖగు నేనిన్.

చ. తఱిఁగియుఁ దానహా పరులఁ దన్నును గంధపు మ్రాను పూరియే
కలఁచియు గోగణమ్ములిడుఁ గమ్మని క్షీరము మేఁతకొద్దిఁ దే
ళ్లురకయ తల్లిఁ జంపి కను నున్నతి యక్కట కుక్షిగాములౌ
పురువులు చచ్చియున్ వమనముం బొనరించు భుజించు నన్నమున్

క. పాలకుల పరిగ్రహమే
మూలంబు సమస్త భూతముల ఖ్యాతి కటుల్
వేలాది సంకు లంబుధి
మూలఁగఁ బేర్పాంచజన్యమునకే వచ్చెన్.

చ. ప్రతి భవనంబునందుఁ బ్రతి వారితటిన్ బ్రతి భూరుహమ్మునన్
సతతముఁ గాకిమూఁక నిజచంచుపుటమ్ములఁ జప్పరించుచుం
గతుకుచుఁ బ్రేలుచుం దనివి గాంచదు మండిత పుండరీక సం
హతులనె యుండిగూడఁ గలహంసవతంసము తృప్తి గాంచెడున్.

క. నళినీకులవల్లభుఁడు క
మలినుల యెద నాఁచికొన్న మధుకరుఁడు పర
స్థల మరిగి విధివశమ్మున
వలచును ధుత్తూరరసమె పరమార్థముగన్.

క. రాచిలుక సుభాషితమును
వాచావైభవము శీల వైఖరి రూప
ప్రాచుర్యముఁ గులసంపద
పూచికతుల్యము బిడాలభూభుజులకడన్.

క. తల పగులుచు వారికై నీ
జల మొసఁగెదు నారికేళ చటులాకృతి నీ
సలిలముగొన నాకుఁ గడుఁ
గిలియగు శుకరాజ సుతుఁడ ఖేదవిముఖుఁడై.

చ. ధర కభిషేక మబ్బె జలధారల వేసవికాఁక తగ్గను
క్కుఱియె దవానలంబు దెసలన్నియు విచ్చె నటించెఁ గేకు లా
దరమున మేఘుఁ డున్నత పదస్థితి లోకహితమ్ము సల్పఁగా
నరయక తద్యశమ్ము శరదబ్దపర మ్మొనరింత్రు దుర్భ్రమన్.

క. కోఱలఁ బాములు కొఱికిన
నూఱినఁ గొట్టినను గోసి నుఱిమినఁ బలుక
న్నెర భువనోత్తరంబగు
సౌరభమువహించు మలయజము శాంతమ్మై.

క. వెన్నెలగలరేలఁ గలువ
కన్నియతోఁ గూడెదవు పగలు రవికర సం
భిన్న నవదళను బద్మిని
కన్నెఱికమువాపె దెంతఘటకుఁడవో యళీ.

చ. హరినఖరాగ్రముక్తములు నంతట నెత్తుటఁ దోఁగువాని సం
బరపడి మంచిముత్తెములఁ బండిన రేఁగుఫలమ్ము లంచు స
త్వరమునఁ బ్రోగుసేసి యొకవాఁగునఁ జక్కఁగఁ దోమికడ్గి లో
నెఱిఁగియు బోయజాయ యచటే పడఁజల్లె నయో సుపాణులన్.

తే. శ్రద్ధతో విను మొకమాట చాతకంబ
ఘనము లెన్నేని మిన్నునఁ గలవు కొన్ని
భూమిఁ దడుపు వృథా కొన్నిపోవు సిగ్గు
దెఱలఁ బ్రతిమబ్బుకడ నోరు తెఱచెదేల.

క. ఖరకరు నిదాఘదాహ
జ్వరమున జీర్ణంబు లయ్యెఁ బర్ణమ్ములుఁ బం
డ్లురలిపడె తరులు నీ కృప
మఱలం దారుణ్యమందె మధుమాసంబా.

చ. నను నిజపంజరస్థుఁ గలనాదవినోదు మనోజ్ఞకీరముం
గనుఁగొను నంతమాత్రమున గర్జిలుచుందు వరే బిడాలమా
తన నిశితాగ్ర దీర్ఘ రదనంబుల నీ తనువెల్ల వ్రచ్చు దం
టను శునకంబుఁ జూచినయెడం బ్రకటింపవు నీదు శౌర్యముఁ.

తే. ఎల్ల దేశాలు తిరిగితి వీవు మధుప
తథ్యము వచింపు పక్షపాతమ్ము లేక
జాజి కెనయగు పుష్పమ్ముఁ జవులుసూచి
గాని కనిగాని మఱి వినిగాని యుంటె.

క. అంతశ్ఛిద్ర సహస్ర మ
నంత శత సహస్ర కంటకావళి బయటఁ
దొంతరలిడ భంగుర గుణ
దంతురతం బాయవెట్లు తామరతూఁడుల్.

చ. కలహకలావినోద శునకంబ రణంబొనరింపు మొంగిలా
కులకడ నాత్మజాతులగు గుంపుల డీకొని యంతెకాని నీ
వల గజరాజు రాజభవనాంగణపూజితుఁ జూచి యేడ్వఁగా
వలదిఁక దాన నీ కొరగి పైఁబడు మేలును లేదు సుంతయుఁ.

క. హరియింపుము విశ్వజగ
త్పరితాపము జలద వారిభరనికరములఁ
జరుగుమవలఁ గాదేఁ హిమ
కరు కరములనైన మాకుఁ గన్పడనిమ్మా.

తే. మణు లగునుగాక జలధిసంభవము లగును
గాక ధర రాదు తగుపరీక్షకులు లేక
మందప్రాయాంధ్రు తమపల్లెయందుఁ గెంపు
ఱాయి వెలగట్టెదరు మువ్వరాటికలకె.

మ. చిలుకల్ పండినపండ్లటంచు భ్రమరశ్రేణుల్ సుగంధాప్తికిం
గలహంసల్ సరసీరుహంబులనుచుం గాకాదికమ్ముల్ ఖగం
బులు మాంసంబని దూరమందుఁగని పర్వుల్ దీయు నీ మీఁది పు
వ్వులు పైపైఁ గని సాగునే సతతముగ్ మోసం బిటుల్ శాల్మలీ.

క. చెవిటిజనమున్న చోటన్
శ్రవణామృతమైన పికము స్వర మింపగునే
యవిదగ్ధు లుండ్రుఁ దదధే
ద వర్ణమగు కాకిఁ జూడ దైవోపహతుల్.

చ. అనలకణాల నన్నిడి శతాధిక వారము లెంత కాల్చినన్
దిన దిన వర్ధమాన గుణ తేజము నాకు లభించు నీ ముఖం
బున కిఁక దుమ్ము ధూళియును బొట్టును ధూమ్రమె కా లభించుటల్
కనఁ బరదుఃఖసంఘటన గండరగండఁడ స్వర్ణకారుఁడా.

క. ఖరకరుఁడు దక్షిణాశన్
గర ప్రసారమ్ము సేయఁ గటకట తానే
కుఱుచవడుట కా దాతని
కొఱఁతయె కారణము దినము కుఱుచవడుటకున్.

ఉ. శారికి వోలె సుస్వర మొసంగునె పించెము నెమ్మికట్లు చే
కూరునె తేనె చిల్కనొకొ కోకిలబాలక పోతకీతులన్
గీరముభాతిఁ బాఠక మొ నెమ్మొయి కుందసితంబొ యంచక
ట్లీ రతనాల పంజరము నిచ్చిరి కాకికి నే గుణంబునన్.

తే. ఒక్క పసిబిడ్డ తనకడ నున్నఁ జాలు
నిద్రగాను నాఁడుసింహమ్ము నిర్భయముగఁ
జుట్టుఁ బదిమంది బిడ్డలఁ బెట్టికొనియు
రాసభికిఁ గేవలము జాగరణమ శరణు.

మ. దళదిందీవరలోచనా సఖుల కుత్సాహంబుఁ గాంతావియో
గులకుఁ దైన్యముఁ గోకదంపతులకుఁ క్షోభమ్ము వేడ్కల్ చకో
రులకుఁ ముప్పు సరోజినీరమ కెలర్పం గల్వకుం గూర్చుఁ జ
ల్వలరాయండె హితాహితంబులకు బీజం బొక్క దైవమ్మె చూ.

క. మహితుల కోర్కులు దీర్పఁగ
మహితాత్ముల కగును నల్పమతులకునగు నే
మహిభృన్నిదాఘ దాహ
ప్రహతికి వార్ముచము లోపుఁ బరులోపుమరే.

క. దానార్థులళులు దూరము
గా నైల్య స్థౌల్యములను గాంచి యి దారా
యేనిక తేఁడని పరుగిడఁ
గా నయయో యేమిసెప్పఁ గాసరపూ యెఁ.

ఉ. మంచు సరోజముల్ కమఠమత్స్యములఁ వలకాంత్రు పక్షులఁ
జెంచులుఁ దూఁడు లేనికలు నీరము భాస్కరుఁ డేమ లెండ్రలఁ
గ్రించుదనాన సర్వము హరింపఁగఁ బేరున కీ సరస్సు క
న్పించెడు వారిదానమున నించుము దీని మహావలాహకా.

క. ఎంతెంత స్నేహరసమున
సంతతము భజింత్రు గాక సాధులు తనుఁ దా
నంతంత తాపమిడుఁ గా
లాంతకుఁడు ఖలుం డహెూ మహాదహనుఁడే కా.

క. హరిణము మున్యాశ్రమమని
పొరపడి చేరితే కిరాతపురి కిట వినవే
నఱుకుఁడు కొట్టుఁడు త్రావుఁడు
కఱచుఁ డనుచుఁ బల్కు శుకనికాయముఁ గూడన్.

చ. ఇరుగడ నుచ్చు లుగ్రధను వెక్కిడి ముందఱ బోయ వెన్కఁ జి
చ్చెరగొను కాననమ్ము నెటు లేఁగినఁ బైఁబడు జాగిలమ్ము లె
ప్పరుసునఁ గాళ్లుచుట్టుకొని పాయనిబిడ్డలు నిండుగర్భపుం
బరువున నేమినేర్తు నని ప్రస్తుతిసేసెఁ గురంగి శ్రీహరిన్.

క. సుమనోలతికల సురత
శ్రమశమలఁ గూడి క్రీడ సలుపుము కానీ
కొమిరె నజాతరజస వ్య
ర్థముగా నవమల్లిమొగ్గఁ దవులకు మధుపా.

మ. తెగనిండం దివియంగ నారి తెగియెన్ దీర్ణంబయెం జాపముం
దెగి పర్వెత్తె శునుల్ దవానలముభీతిం గాలిపోయెన్ వలల్
సొగసెన్ వహ్నియకాలమేఘసలిలస్ఫూర్తిన్ నివాసమ్ము చే
రెఁ గురంగాంగన తాను బిడ్డలు నివే శ్రీశానుకారుణ్యముల్.

తే. కొలనిలో నీరుభేదించి వెలికివచ్చు
పనియొకటి తమ్మిమొగ్గ సేయునది విచ్చు
టయును వాసించుటయు శ్రీనిలయ మగుటయు
సర్వ మహిమాంశుపని యంద్రు శాస్త్రవిదులు.

క. పరిణామఘోరమగు ఋణ
పరిణాహం బుభయలోక భయభరితమెకా
సిరిగల్గు లుబ్ధు కినుకకు
నెఱిగాని నరుండె పరముఁ డీత్రిజగములన్.

4

క. మృదుమధురమరందఝరీ
సదనము సరసిజము వీడి శాల్మలిఁ బ్రేమిం
చెదు మధుపమ యిదుమలకుం
గుదురిది మతిలేదె వెతలు గుడువఁ దలంతే.

మ. జలమల్పంబగు బావి నీచము హ్రదస్నానమ్ము కాసారముల్
బిలసంకాశము స్వాదుశీతజలపూర్ణ విస్వాఁక పాద్యాంబువే
కలితక్షారము నీచ మబ్ధి ఋషికిన్ గండూష మాత్రం బటం
చలసారంగము మాని కోరు నెపుడే నత్యుచ్చమేఘాంబువుల్.

క. చులికితగజేంద్రగండ
స్ఖలితమదాంబువు కరేణుకల గర్వము గ
ర్జల దులిచినహరి హరిణ
మ్ములకై కటా లోఁకువయ్యె ముసలితనమునన్.

ఉ. ఓయి రసాలమా యిటు ఫలోన్ముఖవాటకు మున్నె ముంగ్లతో
నీ యొడలెల్ల నింపుకొని నిల్చితిదేమి త్వదీయశీతల
చ్ఛాయయు మాయమాయె ఫలసంతతి మాట యటుండ నిమ్మదే
న్యాయము నిష్ఫలుండవయినన్ సుఖసేవ్యుఁడ వౌదు వేకదా.

క. అయగుణముల నార్జింపుము
ప్రయోజనము గలదె బయటిబండారములం
బ్రియమైన పాలు లే కెటు
క్రయించనగుఁ బాఁడిమొదవు గంటలమ్రోఁతన్.

తే. హంస లఖిలాంగధవళమ్ములయ్యుఁ గమల
సమితిగాంచినయంత దూరముగనుండు
లోనఁ జొరఁబడె మధుపసంతాన మౌర
ధనమదాంధుల కీగతి తప్పదుగద.

తే. కడిమి నూఁ రేఁగుఁగాక పంకజినిమరగుఁ
గాక గోరంటఁ గాలమ్ము గడుపుఁగాక
దిరిసెనను వ్రాలుఁగాక నిందీవరమ్ము
లను మఱచునొక్కో తేఁటి కాలక్రమమున.

మ. జనియుం బ్రాభవ మిప్పుడేకద విధిన్ ఝుంఝూసమీరంబ యిం
కను నీవుండున దొండొ రెండొ నెల లీ కాసంతలోనే కటా
వనవాటంబులు వెళ్లగిల్లిన వయో వాపీతటాకంబు లిం
కెను దిక్చక్రము ధూళిధూసరితమై కీడొందె నీ ధాటిచేన్.

తే. చిగురిడినదాది మామిడిచెట్టు నాశ్ర
యించుకొనియుండెఁ గోకిల యేఁకరిలియు
నది ఫలించినయంత వాయసపుమూఁక
చుట్టుముట్టుకొనియెఁ బిక మెట్టు బ్రదుకు.

చ. నరపతు లాత్మహస్తనళినంబుల మేన్ నిమురంగఁ బైఁడిపం
జరమున నుండి దాడిమరసాలఫలంబులు మెక్కుచున్ సుధా
సరసజలంబె పేయముగ సంతతపాఠము రామనామమై
పరఁగియుఁ బర్విడుం జిలుక స్వాంత మయో తనపుట్టుకానకున్.

క. నిజముఖమున బహుధాన్య
వ్రజము హతముసేయఁ జాలి పతనసహజతా
త్మజని యగు ముసలమునకుం
గుజనునకు సతమ్ము నేటికోళ్లు ఘటింతున్.

చ. తల ధరియింతు వుగ్రరవితాపము దుస్సహమున్ నిదాఘవే
ళల వడఁబడ్డపాంథుల ఫలమ్ములు నీడ లొసంగి ప్రోచె దె
వ్వలనను భూరుహంబ ధృతివాయకు నీ యశ మంతకంత కు
జ్జ్వలమయి ప్రాఁకుఁబో దశదిశాకము లైన త్వదీయశాఖలన్.

క. కాకులగూఁట వసింపుము
కోకిలమా ఱెక్కలింత కూడినదాఁకన్
నీకు వసింపఁగ వసతుల
నేకములు రసాలసాల మెందేఁ జిక్కున్.

ఉ. గందపుఁగొండ వాయసపికమ్ము లులూకకపోతముఖ్యముల్
మందలకొద్ది నుండుననుమాత్రఁ బ్రయోజనమేమి నెమ్మియొం
డం దొకమూలనుండియు నహో యొక కేక యిడంగ సర్పపున్
బందమువీడి చందనము భాసిలు సర్వజనప్రమోదమై.

క. హాలహలమా దారుణక
ర్మల కేనే గురుఁడననుచుఁ బొగరూనకు నీ
దలకడచి పరశ్శతములు
గలవు దురాయూములాడు కష్టపుమాటల్.

ఉ. త్రావెద విప్పపూరసముఁ దామరపూల రమించుచుండుఁ గ్రొ
మ్మావిమధూళి సాపడెదు మాధవికామధువున్ వసంతమం
దీవు భుజింతు వో మధుప యిప్పు డిఁ కేమని కొండమల్లెలం
దీవరపాటునన్ వలచితిగ్గద వింతదురాగ్రహంబొకో.

క. జననము గజేంద్రమూర్ధము
జనపతుల మణీమకుటము సదన మెవండో
యనభిజ్ఞుఁ డాదరము సే
యనిమాత్రన ముత్తియముల యపరాధమొకో.

క. శ్రీవిష్ణు వతనిపట్టపు
దేవియు భాస్కరుఁడు బ్రహ్మదేవుఁడు నీకుం
గేవలబంధులు మంచుం
దూవరము ప్పకట తప్పద్రోచిరె నళినీ.

క. చనుదేయి సుప్రభాతము
చనుదెంచుం బ్రొద్దువొడుచు సరసిజము హసిం
చు ననుచుఁ గోశగతం బళి
యనుకొను లోపలనె యేనుఁ గబ్జినిఁ ద్రుంచెన్.

చ. సుర లమృతమ్ముచేత మధుసూదనుఁడున్ సిరిచేత దేవతా
తరువులచేత నింద్రుఁడు సుధారుచిచేఁ బరమేశ్వరుండు ని
ద్దర మరియాదచే నుదరధామముచే గిరిజాగ్రజుండు సం
బరపడి రంతెకాని ననుఁబట్టి మహాముని త్రావ నడ్డిరే.

క. ఘనుఁడా వివేకివేకద
వనధి వృథా కురిసెదేల వాఃకణమాత్రం
దనివొంది చిరము నిన్నే
కనిపెట్టుకయున్న చాతకముఁ గనవొక్కో.

మ. క్రియతిం జెప్పఁగరాని శోభగల వంగీ వైకవారాంగనా
నయనశ్రీ గని పుణ్యజీవులు విడెన్ ధైర్యమ్ము సారంగముల్
ప్రియి సైరించి తదీయచారుకుచగర్వశ్రీకిఁ దా మోడియుం
గయిపుం దాల్చుఁగరుల్ పరాభవ మెదం గైకోరు మూర్ఖాధముల్.

క. సురభీకృతహరిదంతము
పరిమళముం గలవు నేత్రపర్వము నీ రూ
పు రసాలమ యిటు లయ్యెను
నెరియించుం ద్వత్కఠోరహృదయగ్రంథుల్.

క. గుణములచే నున్నతుఁడగు
మణిసింహాసనము లెక్కుమాత్ర నెటులగున్
ఫణివైరి యగునె బలిభుజ
మనయముఁ బ్రాసాదశిఖరమందే యున్నన్.

క. గురివెందసరులు కొప్పుల
ధరియించి చరించు బోయతల కాకరమా
పురి ముత్తెపుబేహారులు
దొరకరనం దద్గుణజ్ఞధురు లెవ్వరిఁకన్.

చ. హిమసమయమ్మునం దమకమేచ లతాశతసేవనావ్యథం
గుమిలితినంచు దైన్యమునఁ గుందఁగనేల వృథా ద్విరేఫమా
సుమనసు లాత్మ మెచ్చెడి ప్రసూన ఋతూదయ మయ్యె నిట్టి ప
ర్వమున రసాలసాలమకరందఝురుల్ ప్రవహించు నేఱులై.

క. మణిగని యడుగునఁ దాల్చుచు
దృణముం గనినంత నెత్తినిడు జడధి కెటుల్
గుణరసికత గలుగు నయిన
మణిమణియే తృణముతృణమె మర్మజ్ఞులకున్.

చ. తళతళలాడు చిత్రగతతామరసమ్మును జూచి దాని రం
గులుగని యాత్మ కక్కజము గొల్ప మధువ్రత మందుఁ జేరి కా
ల్నిలుపఁగఁ దావిగాని మధులేశముగాని తదీయమైన కో
మలతయుఁగాని కాన కభిమానమునన్ రొదవెట్టుచుం జనెన్.

క. ధారాధర ధారాభర
నీరమునన్ ధరణియెల్ల నించెడి నీకున్
భారమొకో చాతకముఖ
పూరణమున కొండొరెండొ బొట్టులొసంగన్.

క. చెవిదెబ్బ దినియుఁ గరిచె
క్కు వెంటఁ దిరుగాడుఁ జుట్టుకొని భ్రమరము దా
న విమూఢాంధవిలోచనుఁ
డవమానమ్మును గణింపఁ డధముండగుటన్.

తే. నిశలఁ బద్మినిఁజేర బందివఁడుఁ గర్ణ
తాడనప్రాప్తి గజదానధార కరుగ
సంపఁగిం జేరుచో నిఁకఁ జావెమూడు
నెల్లకడ దుఃఖమే తేఁటి కీ జగాన.

చ. కమలజుఁ డొక్క సౌరభము కాఁపునకే విషవిస్ఫురత్ఫణో
గ్రములగు త్రాఁచులన్ నిలిపెఁ గాఁ బ్రతిశాఖకు నింక దైవ యో
గమున ఫలప్రసూనముల కల్మియెకల్గిన నెట్టి రక్షణ
క్రమము ఘటించునో యెఱుఁగ గంధవనీజమ యేమనన్ వలెన్.

క. శిరసావహించుకొను మిఁక
నిరతము సేవింపు మెంతస్నేహముతో నేన్
దరుణీకచనిచయమటుల్
దొరఁగునె తన కుటిలవృత్తి దుర్జనుఁ డెందున్.

చ. ఇలఁగల తాపమెల్ల హరియింతువు శుక్తులయందు ముత్తెముల్
మొలవఘటింతు క్షేత్రతలమున్ జలసిక్తమొనర్తు చందనా
దుల నిగురొత్తఁజేయుదువు తోయనిధిన్ లవణాంబు వానియున్
జలదమ విశ్వజీవనమొసంగెదు నిన్ గొనియాడ నేరికా.

క. దినకరనిశాకరుల లే
మినిఁ గూర్చి వచింపఁదరమె మిడుకుచు వారల్
దినరాత్రివిభాగముచే
ననయంబును దిరుగుచుందు రంబరధరులై.

తే. పామరులునివసించు కుగ్రామవాటి
జడుఁడెవఁడు నాటె నినుఁ జెప్పు చంపకంబ
యెందు వనశాకములు కడునెదుగుననెడి
కోర్కితో నీ చివుళ్లెల్లఁ గోయుచుంద్రు.

క. తమలపుఁదీవియ ఫలపు
ష్పములిచ్చునె పూచునొక్కొ పనస ఫలితమా
నె మొగలి యొకటియుఁ బూజా
ర్హ మగునె కదళీ ప్రశస్తి యన్నిట నీదే.

ఉ. నాకుఁ శ్రీయని విష్ణుఁ డింద్రుఁ డిఁకఁ జింతారత్నపుం బీఠమే
నాకంచుఁ సుధ మాకటంచు సురలుం జంద్రుండు నాకంచుఁ గం
ఠేకాలుం డఖిలమ్ము దోఁచుకొన బం ల్లేకాని వార్ధిఁ రుషా
పాకుండై చుళికించి త్రావు ఋషి నెవ్వండైన వారించెనే.

క. ఊసరవివరములఁ బయో
రాసులు వీచికలెసంగ వ్రాలి కురెసెదే
కాసంతయుఁ గురియ వయో
భూసారముగల్గు పంటభూముల జలదా.

చ. అళికులబాలలోలకుసుమాంచితమై మధురప్రవాళమై
పొలుచు రసాలసాల మటు పోవిడి తిక్తరసప్రపూర్ణహృ
న్నిలయముఁ గాకభోజ్యమగు నింబవనీరుహ మెక్కి యిడ్డయో
పలుకవు మానమూని పికబాలక యిందుఁబనేమి చెప్పుమా.

క. చలివేళఁ గుందకుట్మల
ములఁ గాదని యెందుఁ బ్రొద్దుపుచ్చితివో య
న్నళిని పరిహీణపరిమళ
యళి నీకురుచింప దేమియనఁగల దింకన్.

తె. కోకిలమృదుస్వనముల నిరాకరించి
భేకముల కర్కశధ్వనుల్ స్వీకరింతు
వమలగంగాజలము వీడి యబ్ధిలవణ
జలము సేవించెద విదేటి తెలివి జలద.

క. జలజావతంస ముక్తా
ఫలాయమానాంబుబిందుభంగతరంగా
కలహంసవతంసములో
కొలఁకా దూరవబకములా కూర్చుధనమ్ముల్.

చ. మృదుఫలముల్ భుజించితిమి మెత్తని మేలి చివుళ్లపాన్పులం
దొదిఁగితి మిట్టి నీడబడి నొప్పెడు చల్లనినీరమానుచున్
మదిమది విశ్రమించితిమి మార్గతరూ సుమనోనురాగ మే
మిది సెలవిమ్ము పోవుదుమె యింకొకసారికి దర్శనంబగున్.

తే. పిశునతాజీవి యానన వివరమందు
నాల్క నెపమున సృష్టించె నాగుఁబాము
నలువ కాదేని యదిసుంత నాకినంత
మడియునెట్లు హతాశుఁడై మంత్రమూర్ఖు.

చ. జలముల కీవ యేలికవు సర్వమణీఖని వీవ నేలతా
ల్పులకును బ్రాణదానమిడు పుణ్యుఁడవీవ మహాత్మకోటి కాఁ
దలరతనంబు నీవ యిటు దగ్గఱఁజేరఁగ నీనిచో నిఁకం
గలఁడె జనమ్ము నాదుకొని కష్టములం దొలఁగింప నొక్కఁడున్.

క. నీ కుసుమము తావికి సవ
తే కర్పూరచందనములు మృగమదమును మా
వీ కలదొసఁగిదె చూడవు
కోకిలకాకములలోని గురుతాలఘుతల్.

తే. గుణములు గుణజ్ఞులంజేరి గుణములగును
గుణవిహీనులఁ జేరి దూషణములగును
మధురరసహృదయమ్మలౌ నదులు జలధి
యందుఁ జేరినచో నపేయంబులగును.

తే. అఖిలవిషయమ్ములను లోలుఁ డయ్యు వీడఁ
డాత్మబోధామృతము రుచు లాత్మవిదుఁడు
వాద్యలయతాళసంగీతవశ్యుఁ డయ్యు
మాళితటఘటరక్ష యేమఱునె నటుఁడు.

మ. హరికిన్ సెజ్జ దిశాకరుల్ మునుఁగుచోటద్రుల్ వసింపంగ నా
దరు వెందుండుఁ దిమింగిలప్రభృతిమత్స్యవ్రాత మెచ్చో నిజో
దరమున్ నింపుఁ బయోద మిందురవు లెందం గ్రుంకుచుం దేలుచుం
దురు పర్యాయత నట్టివార్ధిదొసఁగే తోయం బపేయంబయేన్.

క. రసమతియుం గార్పాస
ప్రసవమ్ములు చూడ మిగుల భాసించు గుణ
ప్రసృతము తదీయజన్మం
బసకృత్పరగుహ్యగోపనాలయ మగుటన్.

ఉ. చందనచంపకామ్రతరుసంతతి గూల్ప వెదుళ్లు వెంపఁగాఁ
జంద్రకిహంసకోకిలలఁ జంప శుకంబటు కాకిఁ బ్రోవ దం
తీంద్రమునమ్మి గాడిదఁ గ్రయించఁగఁ గప్రము దూది నొక్క రీ
తిం దులఁదూఁచు బుద్ధిగల దేశనివాసులకున్ నమస్కృతుల్.

క. భూపులు దురాసములు పెనుఁ
గూపమ్ములగతి నగాధగూఢహృదయు లే
ప్రాపున గుణగతఘటకదు
రాపులు వడయుదురు జీవనామృతరసమున్.

చ. తఱతఱఁ బొఱుచుం గుసుమితంబగు బాలరసాలభూజముం
దొఱఁగి ఫలించుమాత్రమునఁ దుఱ్ఱున నీపిచుమందవృక్షముం
బరుషరవోగ్రవాయసనివాసము చేరి జడాత్మ యెట్లు సు
స్వరమునఁ గూయుచుంటి కలవాణి వృథా చన రాజకీరమా.

తే. ఎవనిజీవాణువులు సంగ్రహించి యిట్టి
ఘనపదము నందుకొను శక్తిఁగంటి వద్ద
యేమిపోఁగాలమయ్యె నీ విప్పు డతని
మీఁదనే యుఱిమెద వెంతమిడిసిపాటు.

చ. మణుల కివే నమస్కృతులు మంగళమయ్యెడు విద్రుమద్రుమ
ప్రణుతవనీతలమ్మునకు భద్రముగాత పయోధి ముత్తెపుఁ
జనియగు శుక్తిమాల కిఁక సర్వధనమ్ము లభించినట్లె యే
వ్రణమిడకే భవజ్జలచరంబులు నన్వెడఁ జాలు నంతియే.

తే. గుణమును దహించు స్నేహనాశన మొనర్చు
పాత్రమునుగూడఁ జేయు నపాత్రముగను
మలినముగఁ జేయుచుండు నమలమునైనఁ
గుజనజనమైత్రి దీపపుఁగొడి విధాన.

మ. తతదావాగ్నిజటాలభీషణచలజ్జ్వాలావళీసంగళ
ల్లతికావ్రాతముతోడ మాఁడుచు సమస్తక్ష్మారుహంబుల్ హతా
హతమౌచుండఁగ నేమిరా సిరిమదం బంభోద భూభృచ్ఛిర
స్తతి నీ జీవము నమ్మి సేసెదు వృథా ధారాంబుపూరంబులన్.

క. ననువిడి షడంఘ్రి చుంబిం
చెను దుమ్మిసుమమని మొగలి సిగ్గిలవల దే
మన పసువౌను జతుష్పది
కనఁగ షడంఘ్రులకుఁ బసువునరయగు టరు దే.

తే. తీయగనున్నను గోప మ
జేయంబగు శాంతిపడఁడు చేఁదుగనున్నన్
మాయురె కఫరోగి కహో
దాయాదుఁడెకా ఖలుండు తత్తత్కృతులన్.

క. కరధృతదండుఁడు జముగతి
హరియటు సగదుఁడు శశాంకునటు వక్రుం డీ
శ్వరుఁబోలె విరూపాక్షుఁడు
జరచేఁ బాపియును దేవసదృశుఁడుగాఁడే.

చ. ఘనతరతుంగభూధరశిఖాస్థితినున్న మహామహీరుహ
ప్రణుతఫలంబులం దిను సపక్షములౌ బలిభుక్కు లుగ్రవా
రణగణగర్వదారణపరాక్రముఁడయ్యును హీనపక్షుఁ డౌ
టను గృశియించుచుండె నకటా మృగనాథుఁడు తత్తరుస్థలిన్.

క. అంతకుఁడైనను జీవుల
కంతసమయ మరుగుదెంచు నంతవఱకుఁ దా
శాంతించుఁగాని యంతక
హంతకుఁడగు నుత్తమష్ణుఁ డాఁగదు క్షణమున్.

మ. ప్రణుతావంధ్యరుషంబు వేని పటుగర్జాఘోష ధైర్యద్రుమా
రణ మింకించె దిశావశేంద్రమదధారావాహినుల్ దైవసం
జనితాపద్దశఁజిక్కి నా హరి సటాఝూటంబయో నేఁడు క
ర్షణముం జేయుచునుండెఁ గేలను జరాసంజీర్ణమాతంగముల్.

క. ఖరకరుఁడు దక్షిణాశన్
గరప్రసారమ్ముసేయఁ గటకట తానే
కుఱచవడుటగా దిఁక నీ
కొఱతయె కారణము దినము కుఱుచవడుటకున్.

చ. అణువులకంటె సాజముగ నక్కట తేలికయయ్యు నెందునున్
గణనకురాక నిత్యమును గాళులక్రిందను నల్గి భూమిలో
నణఁగి విలీనమై హతమహానిల నీ పెనుగాలి నీ రజః
కణములు తుంగభూధరశిఖాతలసంస్థితి నందె చూడుమా.

క. సుమనోసంగతిచేఁ గీ
టమును మహీధరశిరస్తటముపయి నధిరో
హము సేయు శిలయు దేవ
త్వముఁ గను మహితప్రతిష్ఠితంబగు నేనిన్,

క. నిలుచుండఁగ రా దధములఁ
గలిసి చనంగూడ దొక్క క్షణమేనియు లో
కులు లోన శౌండికీకర
కలితక్షీరమును మదిరగాఁ దలఁతురె కా.

చ. అతిబలుఁడౌ సమీరుఁడు నిజాంతికమేఁగ హఠాద్గతిన్ రసా
లతరులు శారికాపికకలధ్వనివాక్యములన్ నుతించు న
మ్రతమెయి కంఠమం దొక సురాభరభాండముదాల్చి నిక్కు దీ
గతి మతిహీన తాళహతకా మహితాత్ముల కేమిలోటగున్.

క. కోటలు గనరావు ముఖ
ద్వారమ్మున హస్తమందుఁ బాశమ్మును లే
దారా ఋణదాతల ముఖ
మారయు జనములకు హృదయ మల్లాడుఁగదా.

చ. హలహలమా త్వదాశ్రయమహాస్థితి యేమన నుత్తరోత్తరం
బలఘువిశిష్టతాపదము నందఁగఁ జాలితి వట్లు తొల్తగా
జలధియురమ్మునం బిదప శంకరుకంఠమునందు నిష్ఠ హా
ఖలుల ప్రసంగవాక్యములఁ గాఁపురముండెదు సుస్థిరమ్ముగన్.

తే. వీణవంశాశ్రయమునఁ దుంబీఫలమ్ము
వెలఁదుల ఘనస్తనములు చుంబించుఁగాదె
యుర్వితలమం దనార్యసంయోగవశత
రాత్రిచరుఁడును రక్తమ్ము ద్రావుఁగాదె.

క. ఏఁగుఁబయికి స్వల్పమున న
ధోగతికిం బోవుచుండు స్తోకమ్మనునే
యీగతి సమానముగఁ దులఁ
దూఁగుఁ దులాయష్టి తోడ దుష్టాత్ముండున్.

ఉ. అంతటి లోకమిత్రుఁ డఖిలాబ్జవనీకులబంధువే కటా
సాంతముఁగ్రుంకు భాస్కరుఁడు సాధ్యమె దాఁట విధిప్రణీతమున్
శాంతివహించి ధైర్యగుణసంగతి వీడకు చక్రవాకి ధీ
మంతులువోలె దైన్యగుణపూంద్యులు కష్టము లుత్తరింతురే.

క. చిలుకలు బందింబడఁగా
కులు స్వేచ్ఛగఁదిరుగు నెట్టిగుణమున్నను రి
క్తులకు నధోగతియే ని
ర్జలఘటములెకాద నూఁతఁ జనుఁ బతితములై.

చ. తనపతి మెక్కియూసిన పదార్థములే తిని తత్కరావగా
హనపరిభుక్తశేషకలుషైకపయస్సులె త్రావి మున్ మృతిం
గనిన కరేణువే సుకృతి కన్నులఁజూడదుగాన బంధన
వ్రణభయవిహ్వలంబయిన వల్లభునాస్య మనర్హదాస్యమున్.

తే. పెఱుకు మామూలముగ వట్టివేఱు దాని
సార మవనీగతముగాన మారుతంబ
మెల్లకడలును బరిమళవేల్లితముగఁ
జేయు నీ మాలతీలత చెనకవలదు.

క. ఒకచినుకకలంకము గొం
తుకయెండినచాతకమ్మెదో కనుగొని దా
నికి నోరుదెఱువ నది వే
ఱొకచోటం బడియె గాలియూఁపున నకటా.

క. సన్నతులు జీవనముగొను
చున్నప్పుడు పిదప మఱల నున్నతు లగుచుం
డ్రెన్న ఘటీయంత్రంబున
కన్నులొ మఱి తమ్ములో దురాయాములిలన్.

చ. నిను వెనుదన్ని సంతతము నిల్చినమమ్ము విచిత్రరూపులం
గనుఁగొని యెట్లువీడెదవు కాదని యక్కట వీడదేనియున్
వినుమొకమాట దీననగు వెల్తియు నష్టము నీకెకాని నా
మనుగడ కేమిలోటు నృపమాళుల నుందును నీలకంఠమా.

క. ధరణిజములు శాఖాశత
భరితమ్ములు కల వరణ్యభాగములందుం
బరిమళభరమిళదళికుల
దళితదళంబులగు తరులు తఱుఁగే కాదా.

చ. అలసవిలోచనమ్ముల వనాంతరమందున నిద్రగొంచు ముం
గలఁ గల కొంగ నారసియుఁ గన్నులుమోడ్చె మృగాధిపుండు త
ద్బలవిభవం బెఱుంగుట నపాస్తమనోభయ గానఁ గంటిరె
ప్పలయిన నెత్తలే దతనిభామిని యేమిపరాక్రమం బొహొ.

క. హరి కెవ్వరు సంస్కారము
గఱపిరి పట్టంబు నెవరు గట్టిరి వనిలో
గురుశౌర్యార్జితవనమృగ
పరివారుం జూచి యతనిఁ బ్రభుతయె వలచెన్.

క. విత్తజ్వరపీడితులగు
మత్తుల కిల శాంతి మంచుమ్రాఁకుల నగునే
చిత్తఱి వర్షాశతముల
నెత్తఱినే నంకురించునే గండశిలల్.

క. నిరతం బరణ్యమున మద
కరిబృంహిత మాలకించి కడపు బ్రదుకు కే
సరి కిట లేదని తలఁతుం
గరీంద్రపలకబళనములఁ గడపుచునున్నన్.

శా. వైదుష్యమ్ము త్యజించి ఛేనికడఁ గైవారమ్ము గావించి నాఁ
డీదుష్టాత్ముని కిమ్మహాపదవి నూహింపంగరానట్టి దే
నే దిక్కై పడరానిపాట్లుపడి యట్లిప్పించితిన్ నేఁడు నే
చేఁదైపోయితి పాదుచిక్కి యెదురేచెన్ వేనితోఁ జెప్పుదున్.

మ. అలవోకన్ నిజబాలకేళితటి ము న్నాషాఢ కాదంబినీ
జల ధారా పరిధౌత ధాతుగిరులన్ సాఁగించె లీలాయితం
బల పంచాస్యము నేఁడు శైల శిఖర వ్యాపాత భగ్నాంఘ్రియై
యలుకన్ బాణిగ్రసించు మాటికి శివాహాంయుప్రరావంబులన్.

చ. కడుగఁగ లేదు దుమ్మయినఁ గాకయుఁ దీఱదు దాహమూఱ దె
క్కడయిన స్వేచ్ఛగాఁ దిరిగి కందములం దినఁగాదు కేళిమా
టడుగకు కేలుసాఁచి యెపుడైనను బద్మిని నంటనైన లే
దుడుగక కారణంబ యిటు లోచెల జుమ్మని మూఁగుఁదుమ్మెదల్.

క. ఇది వాసిరెడ్డి పయసా
ముదన్వదుదయేందు చేత నున్నతకవితా
పదవీమతిచే నన్యా
పదేశ మాంధ్రీకృతంబు ప్రాస్తావికనా.

~~~~~~
~~~~~~

# భామినీవిలాసము

## శృంగారవిలాసము

మ. అల రాహుగ్రహరోషశంక గనరా దావంతయుం బాండిమా
కులభావం బనరాదు చూడము కలంకుం బొత్తు నీ మోమునం
దెలనాఁగా యిపు డిట్టిదట్టిదని యూహింపంగ దుస్సాధమౌ
వెలుఁగేదో యొకఁ డెల్లెడన్ దినదినాభివ్యాప్తియే కాంచెడున్.

క. విరిఁదమ్మిసరము మిక్కిలి
పరుసము పేరునకె మార్దవంబులు తూఁడుల్
తరుణీ నీ తనుకాంతిం
బరికించిన నేటికింక పల్లవగాథల్.

చ. స్ఖలదురు ఘర్మవారి కణికా గణ శాలి కపోలపాళి నూ
యెలవలెఁ గర్ణకుండము లిట్టటునూఁగఁగ వందనీయమౌ
యలయికఁదూలు నాఁటి మదిరాక్షి యొకానొక రమ్యరేఖ లోఁ
దలఁచిన నెందులేని ప్రమదంబొకఁ డీరికలెత్తు నిప్పుడున్.

తే. గురుజనభయమ్ము నన్నుఁ గన్గొనుతలంపు
నెడఁద గలఁగింప నుత్తలపడు మృగాక్షి
దరదళిత సరసిరుహ సుందరములైన
మధుర నయనాంచలము లహహా మఱువఁబోను.

క. క్రమముగ బదరామలక ఫ
లములయు దాడిమఫలంబులయు సిరిగొనుచున్
సమముగ బలిసిన నీచను
లమాంత మిభకుంభలక్ష్మి హరియించుఁ జెలీ.

క. సవిలాసాలకతావై
శ్రవణరమా సంగతాభిరామం బగుటన్
భవదీయకపోలతలం
బువిదా నేఁ దలఁచువాఁడ నుత్తరదిశగాన్.

ఉ. వేసవవెల్లు గాంచి కనువిచ్చుచు నూడిన నీవిబంధమున్
రైకముడిన్ బిగించుచుఁ జరాలునఁ బానుపు డిగ్గనెంచు నా
ళీక విశాల లోచన జలేజ మృదూదర సోదర ప్రభా
శ్రీకము నాభిశిల్ప మెదఁజేరి డిగంజన దెన్నఁడేనియున్.

క. లీలగ జంబీరఫల
శ్రీలను లంఘించి పైడి చికిలికలశముల్
వాలిచి నీ చను లిపుడో
బాలా కనకాద్రితోడ స్పర్ధవహించున్.

చ. గురువు లుపః ప్రణామ మిడు కోమలిఁ బుత్రులఁ గాంచుమో తలో
దరి యని యాశిషంబులిడఁ దత్వరతా మతి నాలకించి యా
సరసనెయున్న ప్రాణవిభు చక్కటికిం జకితాక్షి దారిచెం
బరమ ముదా దరైక భరభావతరంగితముల్ దృగంతముల్.

తే. పయికిఁ గోపమ్ముతోఁ దనపయిని లేని
పోని నేరమ్ము మోపి నేఁ బోఁదలంపఁ
బరిపతద్బాష్పకలుషచాపలదృగంత
కాంత యంగీకరించె నా కఱపులెల్ల.

క. సాయంసమయమ్మునఁ గం
దోయి గృహద్వారమందు నూలుకొలిపి య
ద్దే యిల్లుసేరు ననుఁగని
యాయతలోలాక్షి వికసితానన యయ్యెన్.

క. చెలు లడుగో నీమగఁడని
పలుకఁగ నులికిపడి మొగలివాకిలిదనుకన్
దులదులఁజని వెన్నెలవలె
చెలి నాకనుదోయి చల్లఁజేయుటమెపుడో.

చ. లలిత వినూత్న సాంధ్యకమలంబులకున్ సయిదోడులై సిరుల్
తొలఁకెడుచూడ్కులన్ మనసుదోఁచిన నాఁటిలతాంగియారుపుల్
పలుకని లేఁతనవ్వు నకలంక సుధా మధు రాన నేందిరా
విలసన మయ్యయో హృదయవిభ్రమముం బొనరించు నిప్పుడున్.

క. ఆటలతొందఱలో నా
మాటలె యాళులకు మాటిమాటికిఁ జెపుచుం
బాటలగంధి దవుల నా
మాటలు సడికట్టి మెఱుపుమాదిరి మెఱసెన్.

చ. కలితకురంగనాభతిలకం బిడి మోమున సంజవేళ నె
చ్చెలి నగుమోముతోడఁ గయిసేయుము సౌధశిరఃప్రదేశముం
గళకళలాడుచుం దెలివిగాంచును గైరవకాననంబు లా
శలు తమమోములం గవియు సంతసముం బ్రకటించు నెల్లెడన్.

క. చనుమొన కేలఁబుణికి రి
వ్వున దూరమ్మరుగు ప్రియుని ముఖపద్మము సం
జని తారుణ శోణ విలో
చనమ్ములం జూచిచూచి సతి యూరుకొనెన్.

తే. తనప్రియుని వక్షమున సవతాలుకంఠ
హారచిహ్నము గాంచి లోలాక్షి యతని
యంసమునఁ దొల్తఁజేర్చిన యాత్మబాహు
లతిక నాక్షణమం దూడలాగికొనియె.

క. తనచుట్టు గురుజనం బు
న్నను జెక్కిలిగోఁకునెపమునన్ నాపయి జ
వ్వని దర సందర్శిత కాం
చన బాహానాళ నెరపె నయనాంచలమున్.

చ. మడఁగుచు గడ్డమంటి బతిమాలినఁ గన్నులు జోతులయ్యె నే
నడుగులవ్రాలి మ్రొక్కనకటా నులివెచ్చని బాష్పబిందువుల్
జడిగొనె నిష్డయో బ్రదుకె సంశయమయ్యెఁ బ్రయాణమైన నే
వడువునఁ దృప్తిసేకుఱునొ భామిని కే నెఱుఁగన్ రవంతయున్.

క. గురులనడుమ నుండఁగ నే
సరసిజకోరకము విసరి చల్లఁగవేయన్
దర కుండలతాండవ సుం
దరముగ భ్రూలతిక గుంచి తన్వి కలంగెన్.

చ. కరుణవిహీన మాయికుఁడ కల్లయె సర్వము చాలుఁజాలు నీ
యరసము చేలచెంగు విడుమంచు నిరంతరబాష్పవర్షముల్
గురియ నిరస్తభూషయగు లోలవిలోచన నాకుఁజూప నె
వ్వరుగలరాప్తు లిప్డు గుణభద్రమ నిద్దుర నీవుదక్కఁగన్.

తే. చారులోచన నగుమోము తీరమందు
నీరమునఁ బూర్ణవికసితాంభోరుహమ్ము
గాంచి యిరుగడఁ బరుగిడుఁ గమ్మఁదేనె
పెరకు మొగమువాఁచిన తేఁటిపిల్లమూఁక.

క. హరువిల్లెక్కిడి బంధుల
పరితాప మడంచి యెట్టిపాటును లేకే
పరిణయమాడునొ లేదో
తరుణుఁ డితఁడు జనకరాజతనయను సీతన్.

క. ఎందాఁక నా యెడందన్
సుందరి క్రేఁగంటి వాడిచూపు సుడియదో
యందాఁక స్మృతిపురాణ
చ్ఛందోజ్ఞానమ్ము బిగువుసడలక యుండున్.

చ. కినుకను బైటికేఁగి నడికిన్నిశ వెండియుఁ జేరి తల్పుచెం
త నిలిచి పేరుదాఁచి యొకదబ్బరపే రెఱిఁగించినంతనే
తనమదిలోన నేననుచుఁ దాను గ్రహించియె కాతరాక్షి వ
చ్చెను మెలమెల్ల యిల్వెడలి శ్రీసతి సాత్కృతమైన రీతిగన్.

క. అరమోడ్చిన కనుఁదామర
లరవంచిన కంఠభాగ మవిరళ నిశ్శ్వా
స రభసగాత్రంబగు సుం
దరిసురతోత్సవము చిరముఁ దలఁచుచునుందున్.

ఉ. గందపుఁగొండ సర్పములు గ్రాయు సమీరణముల్ కృతాంతముల్
సుందరి నీవసాగె నిఁకఁ జొప్పడునే బ్రదుకాస నాకు మా
కందముమాళి మంజులముగా నిటు గుంజితముం బొనర్చు నిం
దిందిరముం గటా యుసురె తీయుచునున్న దిఁకేమి సెప్పుదున్.

క. గురుజనపరివృతయై యీ
సరళిన తన యిల్లుసేరు చకితాక్షి ననుం
జిఱునగవునకున్ బొమముడి
గిఱియిడి మెడద్రిప్పి కనిన కీలు దలంతున్.

తే. ఎదపయిని నాఁచుఁదీవెలు పొదల మాటి
మాటి కటునిటు ప్రక్కలు మార్చుకొనుచు
సఖులయం దాత్మసఖుని ముచ్చటకుఁ గడఁగు
చెలివలఁకుఁ దార్చె సతి జాలిగొలుపు దృష్టి.

క. తనచిబుకము నా మోమున
కనుకూలముగా ఘటించి యక్కున శయనిం
చినసతి నాఁడట్లిందృని
ఘనరాజ్యశ్రీని గ్రిందు గావించెఁ గదా.

చ. సుమశరుపోరిలో నలసి సోలిన లేజవరాలి యాస్యపుం
గమలమునుండి వెల్వడు నికామ మనోజ్ఞ నకారముం బలెన్
సమధిక వేదశాస్త్రకలనంబును భారతసంహితాది పా
ఠములును దాపశాంతి నకటా ఘటియింపఁగఁ జాల వంతగన్.

క. పరిపరిఁ బ్రార్థింపఁగ ని
ద్దుర వేకువజామునందుఁ దోడ్తెచ్చిన సుం
దరిచిబుకమంటఁ బో న
త్తటి నహిమాంశుండుఁ గూడ దయదప్పెఁ గదా.

చ. సకలకలారసమ్ముపనిషత్సుధ గ్రోలితి గీత సర్వమున్
నికషణముం బొనర్చితి మనీషికయన్ నికషంబుమీఁద నిం
తకు నయమో శశాంకముఖి నా హృదయమ్మునువీడి సుంత బై
టకుఁ జన దేమనందు నకటా యనురాగతమోవికారమున్.

క. అవలీలగ నీ చెక్కుం
గవ లవలిం బుక్కిలించుఁగద నిజకాంతిం
బువుఁ బోఁడి యాధు లెల్లెడఁ
గవియుచుఁ దెలిఁదమ్మిలందె కాఁపురముందున్.

తే. కుచకలశముల నడుమ నా గోటినొక్క
నొడలు పులకింప మెలమెల్లఁ దడవి కనుచు
కిటికిలోనుండి నేఁ జూచు కిటుకు గని త
లోదరి నతాంగియై యింటిలోని కుటికె.

క. తరలించు దెసలచీఁకటి
తరుణీ హరియించుఁ దాపతప్తుల చేతః
పరితాపము తమ్ములసిరి
పరిముద్రితముం బొనర్చు భవదాస్యరుచుల్.

చ. పొడమిన క్రొత్తజవ్వనపుఁ బోహణపుంబనిచేతఁ గొంకుచుం
గడిమియు శీలమున్ బలముఁ గాంతియుఁ గన్గొనఁ గ్రేళ్లు వాఱుచున్
ముడుచుకొనున్ వికాసమును బొందు రఘూత్తము చెంతనున్న య
ప్పుడు జనకాత్మజానయనఫుల్లసరోజరమావిలాసముల్.

క. తరుణుల గరువపుఁ జన్నుల
పరముం గావించి గౌరవమ్మును లఘుతన్
వరియించు నవయువల జ్ఞా
నరహితధైర్యంబ నీకు నతిశతమిదిగో.

చ. ఎపుడెపుడన్నవాంఛితము లీరిక లెత్తఁ బరీమళించుచుం
ద్రపమెయి మాటికిన్ ముకుళితంబులుగా నవసంగమక్రియా
నిపతరిరంసుబాలపరిణేతృవధూనయనోత్సవంబు లె
ల్లపుడు గృహస్థ జీవనవిలాసకిలాసములై విభాసిలున్.

తే. నా యొడలినిగ్గు బంగారమేయటందు
వేమిపోలికయే యమాయికపుఁబడుచ
యాశలన్నియు విడి యది యగ్గిసొచ్చి
బయటవడినప్డుగద సాటివచ్చునీకు.

క. వారాటిక లార్జించెడి
కోరికఁ జల్లమ్మ సతముఁ గ్రుమ్మఱు గోపీ
తారుణ్యవతికిఁ జిక్కెన్
స్వారాణ్ణీలమణి రాజపథిమధ్యమునన్.

క. కన్నియలకు మాటలలో
నెన్నడలను విభ్రమముల నిత్యంబౌక మే
ల్వన్నియ బెరుగును బాల్యము
సన్నగిలన్ జవ్వనమ్ము సంరూఢముగాన్.

చ. చెవుల నలంకరించుతటిఁ జెందిన నూతనబాధ సీత్కృతుల్
గవయఁగఁ దిర్యగీకృత ముఖంబగు బాల కరాబ్జచాలన
వ్యవహృతు లాత్మపుణ్యపరిపాకములన్ రుచిసూచినావు నీ
దవు జననంబె సర్వజనతాస్తుతిపాత్ర మొహో వతంసమా.

క. రూపారుచిగెడప యశో
దాపుత్రుముఖాంశు సుధను ద్రావెడు బృందా
గోపికకు శివశివా రుచి
లోపించెను సగుణమైన లోకమునందున్.

మ. హతబుద్ధిన్ నడుకానఁ ద్రోచితిని పాపాత్ముండనై సీత నా
స్మితముగ్ధానన నన్నుఁబాసి వనిలో జీవించునే నేనిఁకే
గతిఁజూపింతు మొగమ్ముఁ బుణ్యులకు నీక్ష్మారాజ్యచక్రం బధో
గతికింబోయినఁ బోవుఁగాక బ్రదుకం గాంక్షింపఁబో నేనికన్.

క. నేత్రాంచలావమర్శపు
మాత్రయు మును సయిపలేని మగువ పతి యెదో
యాత్రాపరుఁడై కౌఁగిట
సూత్రింపఁగఁ గిమ్మనాక చూచుచు నుండెన్.

క. పడఁతి నిజగురుజనమ్ముల
కడనుండఁగ మృత్తికాశకలమును దనపైఁ
బడవిసరనెంచు నాదగు
కడఁక నుడిపె నాల్కగఱచి కనుసన్నలచేన్.

తే. ప్రాణములు దీయుటకు హాలాహలముకంటె
మారకుఁడ వీవటంచు నా మదికిఁ దోఁచు
నెవఁడో వదరెను దెలివితక్కువగ నిన్నుఁ
జూచి యమృతాంశుఁడంచు దోషాచరుండ.

చ. మరుఁడెదఁగుండె నెచ్చెలి సమాజము గాంతికిఁ బాసె జీవితే
శ్వరుఁడును బ్రేమచేఁ గలఁగె సర్వము టుండఁగనిమ్ము బేల యా
దరమునఁ గొందువే నొకహితంబు వచించెద మాన మెప్పుడుం
బొరయకుమీవు నీ మొగము పూర్ణశశాంకవినిర్జితం బగుఁ.

క. పడుకగది నొంటిఁ బతి క్రో
త్తడి నిజభుజపంజరమునఁ దవిలింప వలం
బడిన మృగశాబ మటు లె
క్కడలేనిభయాన బాల గడగడవడఁకెఁ.

చ. పయనమువేళ నెల్లరును భద్రవచస్స్తుతులం బఠింపఁగా
శయనగృహైకజాలకముసందున మోమిడి నిస్సృతాశ్రు సం
చయము కుచంబులం దడుప శ్వాసల మోవి వడంక బాల య
త్యయమునఁ జూచెడిఁ శివశివా ప్రియనాథు విలోలనేత్రయై.

క. పొలయలుకఁ బెడమొగంబయి
లలనామణి నిద్రవోవులాగునఁ దన చే
తులు పయికిసాఁచి మెడముడి
దలఁగుచుఁ దనచెక్కు సేర్చె దయితుకరమునఁ.

తే. మిసిమిసిరిసంపదకుఁ బొలిమేరయైన
కమలలోచన నిదువాలుఁగన్నుదోయి
యొకటి రెండవదానిఁ జూచుకొను భాగ్య
మునకు నోఁచమి చాపల్యమును వహించె.

క. ప్రియుఁడు దురదృష్టమున నా
నయనములకు దూరమైన నాఁడాది మ దిం
ద్రియములు నిజవిధ్యుక్త
క్రియలం దాదరములేనిక్రియ నుండెఁ జెలీ.

శా. రానేవచ్చెనురాత్రి దిక్కులలమెన్ రాజప్రభాదీధితుల్
మేనందాల్చిరి భూషలంతిపురులన్ మిథ్యాణుమధ్యల్ సతుల్
మానం బీసున నించుకే నిపుడునన్ మానంగఁ బోవే నయో
దానన్ నీతనువల్లి వాడువడు ముగ్ధా లేఁతతూఁడుంబలెన్.

క. బలమున నడిరే ముత్తై
దులు దను బతికడకుఁ జేర్పఁ దోట్రిలుచును నా
వల నేమిజరుగునోయని
జలజాయతనయన లోన సందేహపడెన్.

చ. అరసమునం బ్రభాతసమయప్రభ గన్పడకుండ జీవితే
శ్వరుకనులన్ లతాంగి నిజపాణులఁ బ్రేమవశానమూసెఁ దా
మరసపరీమళగ్రహణమార్గణచుంచువులైన పశ్యతో
హారులు సమీరణుల్ దెలుప నక్కనిరాక గ్రహించె నాతఁడున్.

క. తరుణీ లోచనదళదం
బురుహద్వయమునకు నెడఁద ముచ్చటపడి క
స్తురిబొట్టు నెపముతో మధు
కరమ్ము నీ నుదుటియందుఁ గళకళలాడున్.

క. కనికరమేలేని మహా
ఘనుండ విఁక నిన్ను విడువఁగాఁ బో ననుచుం
దనకేలఁ జెలియకేలుం
బెనచి వికలయోర్తి యాలపించుచునుండెన్.

క. క్రమ్ముకొనివచ్చె నవమే
ఘమ్ము లిపుడుగూడ విడవుగద కామిని కో
పమ్మను ప్రియుమాటలె కను
దమ్ముల కొన లొరయు నెఱ్ఱఁదనముం జెఱిచెన్.

ఉ. చందనవృక్షసర్పముఖసంజనితంబులువోలె వీచెడిన్
మందసమీరముల్ కనుల మాడ్చుఁ దలిర్చిన లేఁతమావు లే
మందుఁ బికమ్ముకూజితమయంబు హలాహలమున్ విదుల్చు నే
కందువ నీ మృణాళ మృదుగాత్రికి ప్రాణము లింక దక్కునో.

క. అకటా ప్రియు సంకేతపు
నికేతనము సేరనైతి నే విధిచెయిదిన్
సకి చెప్పఁగదే యెఱుఁగను
మకరాంకనృపాలుఁ డెట్టిమల్లడి యిడునో.

మ. తొలుతం గన్పడె విస్మయస్తిమితమై దూరాన నున్నప్డుఁ జం
చలమై కొంచె మెఱుంగు నప్పు డనలన్ సంపూర్ణవిస్ఫారితో
జ్జ్వలమై పెద్దలఁ గూడ నే నరుగ లజ్జాసంభ్రమత్తారమై
యలరెన్ బాలకురంగనేత్ర నయనం బాదేయరాసిక్యమై.

క. హాలాహలమని తలఁచుం
గాలాగరు రసము బాల కనుఁగొన్నంతన్
గాళవ్యాళావళియని
నీలోత్పలమాలఁ జూచి నెలఁతుక దలఁచున్.

తే. అనుజ లక్ష్మణ ప్రాణమ్ము ప్రాణమైన
మీ వదినె కంటఁబడదేనిఁ జావె మేలు
కానిచో నిష్ఫలం బీజగమున నేమి
ఫలము నాసించి మ్రోడునై బ్రదికియుందు.

క. సవతాలువిడిది విడి వే
కువ దయితుఁడు దన్నుఁజేరఁ గోపనయగు న
ప్పూవుఁబోఁడి కన్గొలంకుల
రవరవ జనియించె నరుణరాగాంకురముల్.

చ. దరదళదబ్జలోచనల ధైర్యము సర్వమునున్ వెలార్చు శ్రీ
హరితనుకాంతి గ్రోలు జవరాలికిఁ జూడఁ జిరాపరాధ సం
స్మరణమునం గడుంబెరిగి మాంసలమయ్యును మాయమయ్యె మున్
భరమయివేఁచు రోషపరిపాక మహో యొక తెప్పపాటునన్.

క. పతి దూరాగతుఁ డాడెడి
కతలను రేయెల్ల నిద్ర గాచిన నేని
ప్రతిగాఁ బలుకఁగ లేనో
సతి యినుమే నీమనాల్క చాలింపునుడుల్.

చ. కళలకురాజు చంద్రుఁడు పోకాలు దరిద్రతఁ బూర్ణిమానిశా
కళయును మాసిపోవు నిఁకఁ గైరవముల్ మలినత్వమూనెడుం
గలికి భవన్ముఖాబ్జము వికాసరమాసుషమాభిరామమై
పొలిచిన దిక్కులుల్లసిలు మోదముగాంత్రు సుహృద్వరేణ్యులున్.

క. ఇలు సేరి పోవుటకు నా
జ్ఞ లవమె పరమార్థమనుచుఁ గాచి తిరుగు వా
రల దారిఁ బఱపె లోచన
దళదిందీవరసరమ్ము దయగలదగుచున్.

క. కాలమున రాజు మత్ప్రితి
కూలుం డగు కతన నెఱఁదఁ గూరిన భయముం
దూలింపు వాసదాన
శ్రీలన్ ననుఁ బ్రోవు పాంథు శిశిరాంశుముఖీ.

క. గళితాశ్రుజలకణమ్ముల
వెలికిఁ రానీక నిలుప నిశ్చంచలతా
రలుగల లతాంగి లోచన
దళదిందీవరము లెపుడు దర్శింతునొకో.

చ. మృగనయనామనోరుచుల రేఁచు విభావరి యేఁగుదెంచె నే
యగడునుబొంద కేమిగతి నాఁగును మానమటంచుఁ గాంతలో
వగచుచునున్నయంతటనె వచ్చె మనోభవసార్వభౌము వె
ల్లగొడుగులీలదాలిచి కలానిధిబింబము కాంతిలంబమై.

క. సురుచిరమణిమందిర మొక
యరణ్యమై పిల్లవాయు వనలంబయ్యెఁ
విరహమున వికలయగు సఖి
హరహర బయటపడుమీన మయిపోయెనయో.

చ. పడఁతి కపోలపుం గగురుపాటు గ్రహించి స్పృశించుమాత్ర లో
నడఁచిన లేఁతనవ్వులముఖాబ్జము పుష్పనికుంజమట్టు లే
ర్పడ నును ద్రాక్షతేనియ ప్రవాహము ముంపునకుఁ సమానమై
వెడలు తదీయవాక్యరుచివిన్యసనంబు వచింప శక్యమే.

క. చరణము లపరాధక్షమ
చరమాశ్రయ మందువ్రాలి సాష్టాంగనమ
స్కరణం బొనర్చు ప్రియుఁగని
తరుణీనయనారుణప్రతాపం బణఁగెఁ.

క. ఎడఁబాటునఁ గీలెడలిన
యెడఁదఁ బ్రియుఁడప్రియుఁడ యనుచు నేడ్చుచుఁ దనచే
గ్గడ కేఁగుదెంచినను నె
న్నఁడెఱుంగనియట్లు బాల నాథునిఁ జూచుఁ.

క. పురపురఁ బొక్కిరి కాంతా
విరహులు శశిమండలమ్ము విద్యోతింపన్
మరునాజ్ఞ నొదలలఁ దా
ల్చిరి చూడామణివిధాన శిశిరాంశుముఖుల్.

మ. సువిచారం బదిలేక నిన్నెవఁడు రాజుంజేసె నాధాత తా
స్థవిరుండౌట సమస్తశక్తులుడిఁగెన్ జైవాతృకా యిప్పు డి
య్యువసీరాజ్యము గట్టిపెట్టు మదనుం డన్ నూతనబ్రహ్మ ని
త్యవికాసోన్మదఖంజరీటనయనావక్త్రాధినిర్ణేతకున్.

క. ధవళాక్షి సుషమమాత్రము
మివిలిన నెలవంకవోలె మిన్నక నాచుం
బవనికలసెజ్జఁబడి ధవు
సవిధాగతు మధురదృష్టి సన్మానించెన్.

మ. పసిపాయమ్మది సన్నఁగిల్లఁ గ్రమతన్ బాలా శరీరమ్మునం
బ్రసవాస్త్రుం డఖలప్రభుండు విడిసెం దత్కాల తచ్ఛాసన
ప్రసభత్వమ్మునఁ జెందె మోమురుకలారాజత్వమున్ లేఁత న
వ్వుసుధాసౌహృదతాత్త్వికత్త్వముకనుల్ ఫుల్లాబ్జతాదాత్మ్యమున్.

క. జలధరు నుదయమ్మునఁ గ
జ్జలకశ్మలమయ్యె నాకసము రక్తవిశ్ళం
ఖలమయ్యెఁ బథికహృదయము
పలాశపాండరములయ్యె భామలచెక్కుల్.

క. చెలియకనుతీరుగా దీ
నలుపుఁ దెలుపు వాస్తవమ్మునకుఁ జూడ హాలా
హాలము నమృత మిదిసోక యు
వల మోహముదమ్ములెట్లు వలగొనుఁ గాదేన్.

క. వదనద్యుతి చంద్రకళం
బొదమను మోవిరుచి చివురు మొుఱకనిపించుఁ
మదిరాక్షి యొడలితీరున
కెదురేలే దజుఁ డెఱుంగఁడీసతి సృష్టిఁ.

మ. సకలాలోకనమోహనం బమృతనిష్యందమ్మునా నందబా
లకు దేహద్యుతిపుంజ మాత్మనయనాలానమ్ముగాఁగఁ మృగీ
చికితాలోకనలా కులాంగనల కుచ్ఛ్వాసంబులఁ మోము లెం
డి కపోలమ్ములు పాలిపో నెడఁద గాడెఁ శూన్యచైతన్యమై.

క. చెలి నీ నగుమోముం గని
యళు లానందించుఁ గమలమనుకొని మఱి క్రొ
న్నెలయని చకోరములు ను
చ్చలించి యాడించుచుండుఁ జంచూపుటముల్.

చ. ఇది చిఱునవ్వుగాదు గణియింప నిసర్గమనోజ్ఞకాంతియా
నిది ముఖమంచుఁ నెవ్వఁడనియెఁ వలపుల్ వెదచల్లు పుష్పమా
నిది చనుదోయి నాఁ దగదు హేమమయైకఫలద్వయమ్ము తు
మ్మెదగమివంచు తీవియ చుమీా యిది కామినియంట మిథ్యయే.

క. విరిఁదమ్మిపూల నిండిన
సరసిదె కనుఁగొనుము దీనిసాటిఁ గనమనఁ
దరుణుల కన్నులు నా యెద
చుఱచుఱ దహియించు దాని సొదవిడు సఖుఁడా.

తే. చారువిరలాచ్ఛమౌక్తికతారకమ్ము
ధవళపటచంద్రికాచమత్కార మాస్య
పూర్ణశశిబింబమైన నీ మూర్తి పౌర్ణ
మాసి యనిపించు లేదనుమాన మబల.

క. అళియో హరిణంబో చం
చలాచల విలోచనమ్మొ జానొందు నిటన్
జలరుహమొ చందమామో
తలఁప మృగీనయనమొగమొ తరమే యెఱుఁగన్.

క. చికురభుజగ నాభ్యావ
ర్త కాంతిజల చపలనయన రామాకృతి యే
రికలంఘ్య మ్మొర్ఘురిణి ర
సికు లిట మునుఁగుచును సంభజింతురు దీనిన్.

మ. రణరంగాంగణ సమ్ముఖాహతకియ ద్రాజన్య కంఠీరవా
గ్రణి సందీర్ణిత మధ్యభాగ వివ రాకాశైక నైల్యుండు మా
రణవహ్ని ప్రఖరంబులౌ కరములన్ బ్రహ్మాండముం గాల్చు భీ
షణపూషుం డిది గాన కేపశువాకో చంద్రుండనెన్ వీనినే.

క. దంతద్యుతి నెపమున భా
స్వంతములగు కేసరములు భాసింపఁగ నో
యింతి యలకలను దేఁటులు
దొంతరగా నిల్చె మధువు దొరకుననుచు వగన్.

తే. లలన కుటిలాలకము కపోలమ్మునుండి
గురుకుచమ్మునఁ బడి చూడఁ గొమరు మిగిలె
చంద్రబింబమ్మునందుండి స్వర్ణనగము
వఱకు ప్రేలాడు కాలసర్పమ్ముపోలె.

క. కడలేనికాంతి నన్నె
వ్వాఁడుపోలు నటంచు మిట్టిపడకుము రాజా
కడుకొని మూఢుఁడ యిపుడె
వ్వాఁడు సూచెను జెపుమ యీ ప్రపంచంబెల్లన్.

క. మృదుమధురాధర రుచులం
బొదివిన పలువరుసకాంతిపుంజమ్ము భవ
ద్వదనారవింద మందుం
బొదలుం గేసరములట్ల పూర్ణేందుముఖీ.

క. అంకమ్మువోని కస్తురి
పంకము నీ నుదుటఁ గాంచి పల్లవితగరు
త్సంకోచములయి నిర్గత
శంకఁ జకోరులు విడుల్చుఁ జంచూపుటముల్.

చ. కళవళపాటునందుఁ దటకాపడు నూరక సూచు వెఱ్ఱి చూ
పులఁ బరులన్ నిరర్థముగఁ బోయినచోటికి పోవు వేఁడియూ
ర్పులనుపదమ్ము దీర్ఘముగఁ బుచ్చు మనోధృతి వాయు జానకీ
లలన వియోగదుఃఖవికలత్వమునన్ దశకంఠుఁ డక్కటా.

క. లలనామణి సురవేశ్యలఁ
దిలోత్తమను బోలుదాని దీర్ఘనయన నేఁ
గలిసితినెపుడపుడే మను
జలోక మిఁక నేమిసెప్ప స్వర్గంబాయెన్.

క. శిశిరర్తువేళఁ గమలము
శశాంకమండలము పగటిజామునవోలెం
గృశమధ్య నీ మొగము రుష
వశమున లేశమును శోభవహియింపదు చూ.

క. నీలపటాంచలవృతమై
బాలమృగీనయనమొగము భాసిలె యమునా
కూలవతీబింబితరుచి
వేలావిలసితశశాంకబింబం బనఁగన్.

క. అమృతమయమూర్తియగు న
క్కమలాస్యకు నాకు వజ్రకఠినాత్మునకున్
బ్రమపడి నెయ్యముగూర్చిన
కమలజుఁ డరయన్ వేవికి కాడనవచ్చున్.

క. చలదళికులమగు నళినిం
దలఁపించు మొగమ్ముఁ జపలనయనముఁ జూడం
గలిగినచో నాపయి మరుఁ
డలుగునుగా కేమిసేయు నాతఁడు నన్నున్.

క. నుదురందున నల్లని గుఱు
తెదియో తోఁచఁగ వెలుంగు నెలనాఁగ మొగం
బుదరమునఁ గొదమతుమ్మెద
నిదురింపఁగఁ బొదలు వికచనీరేజమనన్.

క. పూగుత్తుల నమ్రంబగు
తీఁగెకుఁ గుచభారనతవు దీటగు దీవె
ట్లో గర్వాణి చిగురించిన
తీఁగెయు శోణాధరకును దీటగు నీకున్.

తే. బాల నారాకవలని సంబరముతోడ
రాత్రియంతయునున్ జాగరణమెచేసె
ప్రొద్దుటి ముఖమ్ముతావికి మూఁగుతేఁటు
లెంతరొదసేసినను గన్నులే తెఱవదు.

క. అవిచింత్యశక్తివిభవ
స్తవనీయుండైన మరుని దర్పమునఁ గనెన్
భవదాస్య మింముభావము
పువుఁబోఁడీ పద్మభావమును లోచనముల్.

క. పువ్వుగుత్తుల నొరగిన నవ
లవలీలాలితవనీతలమొ సేవ్యము నా
కవు నిత్యముఁ గుచభరనత
కువలయలోచనలు మదికిఁ గొందలమిడరేఁ.

క. కలజగములెల్లఁ దనుశో
భల వెలిఁగించెడి కృశాంగి భామిని గని వె
న్నెలరేయో మెఱుపో యను
దలఁపున సందేహపడరె ధరణీజనముల్.

క. ఉల్లసిత కరాంఘ్రులు హా
సోల్లసముఖమరయు జనము లొందిరి శంకన్
పల్లవితమైన లతయో
ఫుల్లాంబుజపంకజినియొ పొలఁతియొ యనుచున్.

క. నయనాభిరామసుషమా
శ్రయమగు సతిమోముసూచి సంశయడోలా
శయనీయులై జనులు సం
శయించి రంబుజమొ చందమామో యనుచున్.

తే. మిసిమిమెయికాంతి బంగరురసము గురియ
జాయతోఁగూడియున్న దాశరథిఁజూచి
మెఱుపుఁదీవియతోనున్న మేఘమనుచు
వానకోయిలపిల్లలు వని నటించె.

క. మందమతీ పాంథుఁడ నీ
కెందుల కీచింత యాశ్రయింపు మిపుడ యీ
సుందరపయోధరుని నీ
డెందమునకు శాంతి సంఘటిలుఁ దనయంతన్.

క. మందస్మితసుందరముఖ
చందిరయగు బాలఁ జూచి సంపూర్ణసుఖా
నందమునొందెఁ జకోరమి
ళిందమ్ములు కోరికలు ఫలించె నటంచున్.

క. ముకురాస్య చన్నుఁగవ యొక
టొకటి కలిసిమెలిసి బలిసి యున్నతిగని యుం
టకుఁ జూడలేక దిగులున
నకనకలం గుడుచుచుండె నడుమని తలఁతున్.

చ. పవళులు రేలున్ గళముబంటి జలమ్ముల నిల్చి నిశ్చల
వ్యవసితచిత్తసంస్థితి నహస్కరు నర్చనలన్ భజించుచున్
ధవళవిలోలనేత్రకుచతం బడయంగఁ దపమ్ముసేయుచు
న్నవియొ యనంగ నిత్యముఁ గనంబడు నీ సరసీజమాలికల్.

తే. యముననీరమ్ములోపల నరమునింగి
కొలకొలని కూయు కొంగలగుంపు లెసఁగెఁ
దమ్ముఁ గసివట్టి యంధకారమ్ము మ్రింగఁ
జిక్కి వాపోవు జాబిల్లిశిశువులట్లు.

క. పగడముఁ దమ్మియు సంపెఁగ
మొగడయుఁ జీఁకటియుఁ జంద్రముఁడు వెన్నెల యె
ప్డగు నొక్కెడఁ గూడఁగ నా
మొగమున కపుడే రవంత పోల్పఁగ వచ్చున్.

క. పెద్దలబడి నడచుచుఁ దన
ముద్దుమొగము మందహాసమున వికసింపన్
ముద్దియ మెడమఱలిచి కను
నొద్దిక బ్రహ్మాండమెల్ల నూటాడించెన్.

తే. సకియ రాపాడు నీ గుబ్బచనుల నడుమ
నిగనిగలు వెలిగ్రక్కు మాణిక్య మొప్పె
మధురరాగరసార్ద్రమౌ మానసంబు
ప్రాణవిభుఁ జూడ బయటికి వచ్చె ననఁగ.

చ. సకలకలావిలాసములసంపుటి నీ మొగమున్ సృజించు ధా
తకు మది మోహపుందమము తాఁకె నటంచుఁ దలంతుఁ గానిచో
సుకృతి యతండు నిన్నువిడి శుద్ధజడాత్ముఁ గలాదరిద్రు నో
ముకురముఖీ శశాంకు నిటు మూర్ఖవిధంబున రాజుఁ జేయునే.

క. వనితయని యెల్లరందురు
ననఁబోఁడిగఁ జెంచి తోఁచినపగిది యెవరే
మనుకొన్న యువజనుల పం
డినపుణ్యతపస్య యంచు నే ననువాఁడన్.

చ. కులసతి కృష్ణలీలలను గోకులవృద్ధులగోష్ఠి వించుఁ జె
క్కులు తమితోఁ జెమర్చుచు గగుర్పొడువంగఁ దటాలునన్ విష
జ్వలితమహానలం బుమియు పన్నగనాథుఫణాతటంబునన్
జలుపు తదీయతాండవదశాగతులన్ వివరించు వింతగన్.

క. కరచరణయుగ్మములఁ బం
కరుహవతియు మీనవతియుఁ గనుగవఁ గచతా
భరమున శైవాలవతియు
నరవిందదళాక్షి సురసియగు సరసియొకా.

తే. కువలయాక్షి విరహఘోరాగ్నికుండమా
గద త్వదీయమైన హృదయమందు
విభుని సంగసుఖము వేడి ముక్తాహార
మిపుడు సేయుచున్న దిట్టితపము.

మందస్మితసుషమాలవ
కందళముం దాల్చి నీ మొగంబెపు డపుడే
సుందరి దశార్ధబాణుఁడు
కందర్పుఁడు గెల్చె నీ జగత్త్రితయమ్మున్.

చ. పొలఁతుక నీమొమో మమృతమున్ దెసలెల్లెడఁ జిమ్ముచుండఁ బూ
విలుతుధనుర్మహత్త్వ మొకవిఘ్నము లేకయె సాగెఁ జీఁకటుల్
దలఁగెఁ బ్రజావిలోకపరితాపముతోడ నిఁకెందుకోసమో
తెలియదు చంద్రుఁడెప్పు డరుదెంచుట తెల్లమొగమ్మునై చుకన్.

క. మలయమరుచ్చందన శై
వలము లుశీరము మృణాళపద్మము లపశీ
తలములుగఁ దోఁచు విరహ
ప్రళయాహతచేతనులకుఁ బ్రాణులకెల్లన్.

చ. దిగులిఁకఁ బ్రేయసీ విడుము తేటి ననుంగనువిచ్చి చూడు నీ
మొగ మిటులెత్తుమంచు నెదఁబొంగిన రాగమునన్ విభుండు కే
లొగ్గిచి వచించునంతటన పొంగి ప్రవాహములైన బాష్పముల్
దిగువడిపోయె మానమును దీఱగడం బడియెన్ లతాంగికిన్.

క. శంబరభంజనుఁడగు పు
ష్పాంబకు రాజ్యాభిషేచనారంభముహూ
ర్తంబెటిఁగి వెల్లవేసె జ
గంబు సుధాంశుఁడన రాక కళకళలాడెన్.

క. ఏలికయును యాచించినఁ
దేలికమైపోవు నొక్క తృటిమాత్రన నే
జాలివడి యధరయాచన
నాలరిఁ గాలేదె విముఖవగు నీచేతన్.

క. అమృతమయకిరణముల వి
శ్వము వెలుఁగించుచును హరిణశాబనయన యా
స్యము నెపమునఁ గుముదవనీ
రమణుం డుదయించుచుండె రాజని తలఁతున్.

చ. చూపులు చూపులం గలిపి చూడదు నవ్వుచు మాటలాడుచే
పాపము త్వత్ప్రసంగములఁ బైగ మొగమ్మున గంటువెట్టునం
చీపగిదిన్ సపత్నికథ నేకరువెట్టుచు భర్తృసన్నిధిం
బాపికొనెన్ లతాంగి తనపైఁ బతికింగల తొంటిప్రేమయున్.

క. కదలెదు ముంగురు లటునిటు
పొదలు మృగీశాబనయన మొగముంగని నా
యెద సంస్మరింతు నళికుల
పదసంచారమ్ముతోడి పంకేరుహామున్.

చ. మడఁగుచు జాలిగొల్పఁగల మాటల వల్దని యెంత యడ్డమై
నడచిన దూరదేశముచనం బయనంబగు నన్నుఁగాంచి క్రో
త్తడి తనవ్రేలిసంజ్ఞబడిఁ దారిన పెంపుడుపిల్లికూన న
ప్పుడపుడ దారికడ్డముగఁ బుచ్చి మఱల్చెఁ గదా ప్రయాణమున్.

క. ఎంతటిధీరుల యెదలే
నింతింతగఁ గత్తిలేకయే తఱిగెడి క
ర్ణాంతవిలోచన మాయా
మంతనలీలావిలాసమహిమ లెసంగున్.

క. బడబానలహాలహాలముల
వడువున మకరములుఁ దానుఁ బన్నగము లోకే
బడిఁ బెదిగిన శశి జనులం
గడతేర్పఁగఁ గారణంబు గాకుండునొకో!

క. నిజకరముల నిమురుచు నం
బుజి నల్లన మేలుకొలిపి ముద్రితవదనం
బ్రజనితరాగరసకలా
విజయముతో భానుఁ డుదయవేళ వెలుంగున్.

క. మదిరాక్షికి రతివిభ్రమ
సదనం బుదయించె నెపుడు జవ్వన మపుడే
మొదలిడియె నవయువల మృదు
హృదయంబులు నిప్పులేకయే మండుటకున్.

క. చెలి నీ ముఖచంద్రకలా
కలనము ప్రసరింపకునికి ఘనకాంతుల లో
కుల మోహపెట్టు కచసం
కలనము నెంతున్ వనాంధకారమ్మనుచున్.

క. కొలనందుముంచి యుంభిత
జలకుంభము నెత్తికొంచుఁ జయ్యనఁ జను మీ
కెలని పొదరింట జరిపిన
కలయికగుట్టెఱుఁగు నొక్క కందర్పుండే.

క. ఈ కీకాటవి నీవలె
నా కాంతుఁడుగూడ పాంథ నవయుచుఁ దిరుగున్
నా కుశలవార్త యేమని
వాకొందును నేఁటి కిట్లు బ్రదికియె యుంటిన్.

తే. ఏకశయ్యాపై నుండియు నేలతాంగి
దయితు నిట్టూర్పు గాడ్పుకే తల్లడిల్లు
నిప్పు డా బాల యెద స్పృశియించు నతని
పాణిపద్మము మెలమెల్లఁ బాయఁదట్టు.

క. తుల నీకుఁ గనక గగనా
వలగ్న యెప్పుడును గర్వపడకుము నానా
ఫలభారనతలయిన తీ
వెలు కలవే యెన్నిలేవు విపినంబులలోన్.

క. తీయని సంగీతమ్మం
దీయును సర్వత్ర దిమ్మదిరుగు నెమురుగా
డాయుం గ్రమ్మఱ నచ్చోటు
వాయున్ మఱివచ్చుఁ దేఁటిపదుపు సరసులన్.

క. ప్రియుఁడున్న సెజ్జనే తా
శయించియు నిజేప్సితములు సఫలపఱుప సుం
తయు నేరక దరమీాల
న్నయనములం జూచు బాల నాథు మొగమ్మున్.

క. మృగశాబవిలోచన యెం
దగుపించదో గృహిణియగుచు నా భవనం బెం
తగ సిరులుమూాలుగుచుఁ బై
కగుపడినను దలఁప నది మహారణ్యమెకా.

క. దినమొకరీతిగఁ బ్రేమిం
చినకొలఁది సమస్తముడిపి చిత్రమ్ముగ నా
మన మేకరసనిమగ్నము
గనొనర్చె శుభాంగి తత్త్వకథ కెనయగుచున్.

క. తనలోఁ దానేమేమియొ
గొణుఁగుకొనుచు నురక నవ్వుకొనుచును మఱి కో
కనదమ్ము సేసికొనుచుం
గను మద్యపు శూన్యదృష్టి కలజగమెల్లన్.

క. కళహెచ్చె మొగము లోచన
జలేజయుగళమ్ము విచ్చె జలదమయముగా
నిలయెల్ల సేయు నల్లని
జలదము నెంౘైన నీవు సఖి చూచితివా.

క. నును లేనగవుం గాంతికి
గనియగు నీ మోమొకింత కన్పటిచితివా
క్షణమాత్ర నస్తమించును
వనితా రాకేందురాజ్యవైభవ మెల్లన్.

క. తోయమ్ముల నిల్చి తపో
వ్యాయామమునన్ సవిత నుపాసించుచు నీ
తోయజము నీ ముఖముతో
తోయజవదనా రవంత తులయగు నిపుడున్.

చ. చలదల కావళీ విపుల చారు విలోచన లీల లెల్లవా
రల నయనంబు లాఁచికొన రాగమునన్ మునిమాపువేళఁ ద
న్వలచి చరించువానిఁ బ్రియవల్లభు నింటికిఁబోవు చంచలా
చల నయనా విలాస గతిచారిమ మెవ్వరి మోహపెట్టదే.

తే. శ్వాసమాడుట లేదొడల్ చల్లవడియెఁ
జూపుకూడ నిలిచిపోయె నాపెఁ గూర్చి
వార్తలిఁకఁ జెప్పనేటికి వలయునేనిఁ
జెప్పు మితరచరిత్రముల్ చెలిమికాఁడ.

క. నడకలు బాల్యముతోడన
జడిమవడెన్ మోవితోడ స్వాంతము రక్తిం
బడసె ననవిల్తుతోడన
పడఁతిపిఱుఁదు చూడఁజూడ బలపడిపోయెన్.

క. అనురాగమధురములుఁ జం
దనశీతలశీలములును దాక్షిణ్యరస
ప్రణిహితములుఁ జతురములగు
వనిత మనఃప్రకృతు లెదకు వాగురలాయెన్.

చ. విమలరదాంశుకాంత మరవిందరమాపహరమ్మునన్ సుధా
సమధికమా మృగీనయన చారుముఖంబు సృజించి చంద్రబిం
బముఁ బునరుక్తమంచు విధి మర్మమెఱింగియు దానిఁ దాఁ దొలం
పమికి గతంబదేమియొకొ పండితులన్ ఘనుఁ డాతఁడేకదా.

తే. అప్పటి ముఖమాధుర్యం
బప్పటి కరుణాంతరంగ మంగన నీయం
దిప్పుడు కన్పింప వయో
గుప్పిన గుణగతులు మార్చుకొంటివొ యేమో.

చ. శయనగృహంబుఁ జేరి కనుసన్నఁ జెలిన్ వెలికంపి వీవనం
గయికొని వీచునన్నుఁ గినుకం గనియుం గననట్టులె దొంగనిద్దుఱం
బయిఁదలి కన్నుమోడ్చి చెలువా కడు డస్సితి చాలునంచు న
త్యయమున నాత్మనఖమునఁ దార్చుకొనెంగద మత్కరాబ్జమున్.

క. ఘనజఘనభారమునఁ బ్రో
వను నడచుచు దుఃఖపడు కువలయాక్షి గనుం
గొని యేమియుఁదోఁచక నే
నును గట్టా దుఃఖపడుదు నులియు నెడందన్.

క. పరిణయమున రాముఁడు నిజ
కరమున గ్రహియింప స్వేదకంపితమాయెన్
ధరణిసుతకరము హిమకణ
భరమారుతవిహ్వలప్రభాతాబ్జమనన్.

క. కలకాలముఁ గనువిందై
కళకళ సిరులీను నీ మొగముతో నిశలం
బలపలనై సిరిదొలఁగెడి
జలజాతము నేమిభంగి సరిపోల్పనగున్.

క. ఒకసంభ్రమయ్యె నిలు ప్రళ
యకాల శిఖియయ్యె రాక యసువులె బరువై
నకనకలు గురియు ప్రేఁతల
కకటా కృష్ణుండు మధుర కరిగెడు వేళన్.

క. సురతాంతశ్రమజలకణ
సరము పరాభూతరత్నజాలము సతి బం
గరురంగునిటలమునఁ గాఁ
పురమిడి యన్యోన్యశోభ ప్రోదియొనర్చున్.

క. అరుణమగుఁగాక పగడం
బరయం జివురెంత మృదులమైనను నగుఁ గా
కరవిందనయన మధురిమ
గరిమన్ నీ మోవి వానిఁ గడకొత్తించున్.

క. వరునెడఁదఁ జొచ్చె జానకి
పరపూరుషదృష్టి వజ్రపాతభయమునం
బరకాంతాభుజగీభయ
హరణార్థం బామెహృదయ మతఁడును జొచ్చెన్.

క. అలక లహిశాబశీలము
లల నేత్రాంతములు పుంఖితాశుగలీలా
వలితములు స్త్రీయె తానొక
చలచ్చపల యెట్లు సౌఖ్యసాధన మగుటల్.

క. కలితసుకుమారమృదులాంగకముల బలిమిఁ
గుసుమలక్ష్మి హరించె నీ బిసరుహాక్షి
పాఱజూడక మామక ప్రాణములనె
తీయుచున్నాఁడు మరుఁడు పుష్పాయుధముల.

క. కనకాంగి యంగకము లిడి
మనుజుల ప్రాణములుగొన సమంజసమగు లో
చనవనజయుగళకోణ
వ్యనిపాతహాతిం గొనంగఁ బాడియె తలఁపన్.

తే. ధవళముక్తారుచులమించు తరుణి దంత
పంక్తి సావాసమునకు సంబరము చెందు
నాసతలఁ ద్రొక్కి నిల్చి దంతాలమీఁద
స్వారిడెదు ముత్యమా యెంత సాహసంబె.

క. మిసమిసలాడెడి నీ మెయి
పసిమికి మాటికిని మిట్టిపడకుము నీమై
పసకుఁ దులయగుచు ముగ్ధా
పసిండి మూలుగుచు లేదె ప్రతిగృహమందున్.

క. నాళీకోదరపరిమళ
వేలము మణిరద మధరితబింబాధరమో
బాలా నీ ముఖమునఁ దాం
బూలము గలదంచు నెఱుఁగఁ బోలును దేనన్.

క. అధరసమాగమమున సతి
రదములధావళ్య మరుణరంజితమయ్యెన్
బిదప సితస్మితరుచి సం
పదగొని యుష్పొంగె జాతపక్షంబగుచున్.

తే. ముక్కుతుదనొప్పెడి బులాకి ముత్తియంబు
రుచులఁ దళుకొత్తు నా వరారోహ మొగము
కానఁగానయ్యె బుధసమాగమమునాఁటి
పూర్ణిమాచంద్రమండలంబో యనంగ.

క. కరికుంభములకుఁ గుచములు
నిరంకుశులు కవులు పోల్ప నీవేమని యా
దరమున వినియెదవు చెలీ
తరుణులు విపరీతకథలె తలఁదాల్తురె కా.

చ. కవుఁగిటఁ జేర్చు ప్రాణవిభుఁ గాదని రోషవశంబునం బరా
భవ మొనరించి నా నకట పండుకొనెన్ బెడమోముతోడఁ జి
క్కువడిన బుద్ధి నెంత మదిఁగుందెనొయన్న భయాన గాటపుం
గవుఁగిటఁ గ్రుచ్చిగ్రుచ్చి చిరకాలము ముద్దులఁ దేల్చె వల్లభున్.

క. వదనేందుమండలము ప
య్యెద చెఱఁగున మఱుఁగుపఱిచి కృష్ణుం గను ప్రే
ముదితలనీవి తనంతన
వదలెన్ స్మరజాతకంపవాతాహతులన్.

క. రమణీయ వాక్కలా వి
త్తమవేంకటసుబ్బయాభిధానునిచే నీ
క్రమమున శృంగారవిలా
స మనూదితమయ్యె రసికసంతర్పణమై.



# భామినీవిలాసము

## కరుణ విలాసము

తే. పగతుఁడై పోయె విధి కటా బంధురత్న
మేఁగె దివి కెవ్వరికిఁ దెల్పు దీ యవస్థ
యింత చల్లనిమాట నీ కెవఁడు సెప్పి
నీ మనోవ్యాధి పోకార్ప నేర్చు మనస.

తే. జ్ఞప్తియే లేదు విషయవాసనలఁ గూర్చి
వెతలఁ గందిన విద్యయు విముఖ యయ్యె
మృగనయన కేవలముగ నా యెడఁదనుండి
బయటికిం జన దధిదేవతయును బోలె.

తే. పరుగుఁబరుగునఁ గైవల్యభద్రపదము
చేరుచు దయావతీ త్యజించితివె దయయుఁ
గనవయితి నన్నయో యుషఃకాలనీల
కమలగర్వాపహమ్ములైన కన్నులెత్తి.

తే. నాకరం బూఁతగొని పెండ్లినాఁడు నీవు
సన్నికల్లెక్కితిగద కాల్జారు ననుచు
నిపుడు నను వీడి యెటు స్వర్గమేఁగుచుంటి
వని యెడఁద నూఱుపాయలై యరుగు నబల.

తే. దోషరహిత గుణాఢ్య విభూషణాంగి
శ్రవణశుభవర్ణ భావరసప్రపూర్ణ
మత్కవితవోలె మన్మనోమధురమూర్తి
నవల తాలన్వె వీడము నా మనమ్ము.

తే. కమలములకున్న దిగులెల్ల సమసిపోయెఁ
జంద్రబింబముకాంతి మిన్నందిపోయె
కలకలలురేఁగెఁ గోకిలగళములందుఁ
బ్రేయసీ నీవు నను వీడి పోయినపుడె.

తే. మెఱపు మెఱిపించి మాయమౌ మెఱపువోలెఁ
గొన్నినాళ్లింద్రభోగాల నన్నుఁ దేల్చి
రాజ్యరమ మంత్రమూర్ఖగు రాజునట్లు
పోయితే మందభాగ్య నా చేయిజాఱి.

తే. నేనెదో నేరముంజేసినా నటంచు
నింతకినుకకు లోనయితే మృగాక్షి
యరిగితిగదా సుదూరముక్త్యాలయమున
కరయ్యో నన్నుఁ బతివ్రతవయ్యు విడిచి.

తే. అమృతమధురముల్ నీ విలాసములె తొలుత
హత్తుకొని నా యెడంద కావ్యాత్మ సేసె
గుణవతీ యవి లేకెట్లు కుదురు మాకు
మానసరసాయనమ్మగు మధురకవిత.

తే. నీ మధురహాసకాంతి రాణించు జగతి
రాక సుకవుల కక్కఱలేకపోయె
నీవు గతియించిపో నిప్పు డేణనయన
సకలలక్ష్మీ విభూతి దానికిని బట్టె.

తే. స్నానమాడించి మధురమందస్మితామృ
తమున వికసితనేత్రోత్పలముల వీచు
నిత్యకల్యాణి నా గృహేందిర యొకప్డు
వెలికిఁ గామేశ్వరి మదాత్మ వీడి చనదు.

తే. ఇలఁ జరించుచు నాథ ప్రాణేశ్వరా య
టంచు నెవ్వని స్వర్గ మెక్కించినావొ
యట్టినను నేలపాల్సేసి యమరలోక
మరిగి తిపుడెట్లు హరిణశాబాయతాక్షి.

ఆ. పసిఁడిమించుకాంతి పరమవిశుద్ధియు
నాత్మశిఖలదీప్తి నధిగమించు
ననుచు కాంత హృదయహారిణి యనక నీ
గాల్చివైచెఁ గోపకలుషుఁ డగ్ని.

తే. భామినీ నీవు కలనైన భర్తకంటె
నన్యుఁడగు వానిఁ గనుఁగొన నభిలషింప
వేమనుచు నక్కటా గుణహీనుఁడైన
పరపురుషుఁగూడఁ బఱచి తిప్పాటఁ జెపుమ.

తే. ప్రియుగుణము లేమఱక సంస్మరించుకొనుచు
శయనమున నత్తమిల్లిన సాధ్వి నేను
నూచి తిప్పుడయో యేమిచోద్య మెంత
పలుకరించిన నాతోడఁ బల్కదుగద.

తే. అమృతవర్షము గురియు వాక్యములరీతి
కృతిజనస్తుతమయిన నాకృతియుఁ గరుణ
రసభరమ్మయి భువనోత్తరమగు నిట్టి
కృతి నుతింపఁగ వేడు కెవ్వరికిఁగాదు.

క. గుణిచే బహుభాషా భా
గునిచే నభిజాతుచేత క్షోణీ హితవ
ర్తనుచేఁ గరుణవిలాసం
బనూదితంబయ్యె సుకవిహర్షోదయమై.

# భా మి నీ వి లా స ము

## శాం త వి లా స ము

చ. తతవిషయాటవీవిలయతాండవలగ్నదవానలార్చులన్
హతమయినట్టి నా హృదయమాతఁ జకోరమటుల్ మిళద్రమా
హితమయి సర్వమాధురుల కిల్లగు వ్రేఁతల మేలువాని సు
స్మితముఖచంద్రబింబమునఁ జిక్కని వెన్నెలలానుఁ గావుతన్.

చ. జలధిసుతావిలోకజలజాతసమాశ్రయ నన్ను విస్ఫుర
జ్జ్వలన విజిత్వర జ్వర విధాత్వర భంగుర శీతలాత్మగం
జలుపఁగదే ప్రభాత జలజాత మదాపనయంబులై జగం
బులు వెలుఁగించుచుండు పరిపూర్ణ కృపామృతలోచనంబులన్.

చ. తలఁచినమాత్ర లోకముల తాపము జాలిమెయిన్ హరించుచున్
వెలయ శతాధికంబులగు విద్యుతులన్ మిఱుమిట్లు గొల్పుచున్
బలిసి కళిందజాతటసుపర్వవనీరుహలంబమానమా
జలధరమాల నాయెడఁద సంతతమున్ స్పృశియించుఁగావుతన్.

చ. లలితకళిందజాతటవిలాసవనుల్ వెలుఁగించుచున్ జనా
వళికి గతాగతశ్రమమువాపెడి చల్లనినీడలిచ్చుచున్
గలితలతాశతంబగు వికస్వర చారు తమాల మాత్మక
గ్గలమగు మామకశ్రమము గ్రక్కునఁ దానడఁగించుఁగావుతన్.

క. గ్రీష్మర్తుభానుమండల
భీష్మజ్వాలాభితప్తవిధురుఁడనగు నా
యూష్మలత నింద్రనీలవ
పుష్మంతుఁడు ప్రావృషాబ్దముం బలె నడఁచున్.

క. అనుపమ మానందము నా
కనుదోయికిఁ గూర్పఁగల యొకానొక కాదం
బిని మామక సంతాపం
బును క్షణమాత్రమునఁ దుడిచిపుచ్చును గాతన్.

మ. విమలంబై సుధకంటెఁ రుచ్యమగు నీ వేదాక్షరానుజ్ఞ స్వ
ప్నమునం దేని మదాంధబుద్ధి గణియింపం బోను లోకేశ లో
పము లీరీతి సహస్రమున్నను ననుం బాటింతు నీవానిఁగా
సుమతుల్ నిన్నునుఁ బోలె నన్నెనయు దుష్టుల్ సృష్టియం దుందురే.

క. పగతుఁడు నెత్తిని నిప్పులు
ధగధగ మండించుఁ గాకఁ దరవారి మొనం
దెగవేయుఁగాక యేమే
నగుఁ గాకను నేను వలుక నపభాషణముల్.

మ. చనుపాతాళము దాఁటుసాగరములన్ స్వర్గంబునుం జేరు కాం
చనభూమీధర మెక్కు మెంచుచనినన్ సంతృప్తి లే దాశకున్
మనమా వ్యాధియు నాధి రూపడఁచి క్షేమం బిచ్చుమం దొక్కటే
కన శ్రీకృష్ణరసాయనం బితరకైంకర్యమ్ము లాయాసముల్.

చ. అలయక దుర్గమోగ్రవిషయాటవిఁ గ్రమ్మఱి యంతుబొంతునుం
దెలియని సంసృతిం దిరిగి తిర్గి విరామ మెఱుంగఁబోని న
న్నలసినవాని మందమతి నాదుకొనున్ యమునానదీతటీ
నిలయనమైన క్రానుఁగువనీజము తాపములన్ హరించుచున్.

క. తొలుతను ముద్దాడి పదం
బులు జంఘలు జాను లూరువులు నాభి యుర
మ్ములు నక్కునేర్చి యిఁక నా
తలంపు విహరించు హరివదనకమలమునన్.

క. తరియించుకొఱకు జీవుఁడ
దొరకదు దారియని యేల దురపిల్లఁగ నీ
స్మరణమున గోపికాసుం
దరుండు నీ కంటి కెపుడుఁ దగులఁగ లేదే.

చ. కలశపయోధిపుత్త్రి బిగికౌఁగిటఁ జేర్చి కవుంగిలింపఁగా
నలరెడు ప్రేంకణంపులత యల్లునఁ బొల్చు తమాలభూజముం
బలెఁ గనువిందుసేయు భగవంతుఁడు విశ్వమయుండు మన్మనం
బలమి యసుప్రయాణసమయంబున నాకగుపించుఁ గావుతన్.

క. మలయానిలహాలహాలముల
వెలఁదుల చికురములఁ గాద్రవేయోగ్రఫణా
వళుల ద్విజశ్వపచులయం
దలవడుఁ బరమాత్మబుద్ధి యనవరతంబున్.

చ. అహితహతంబు విశ్వమని యారసి నేత్రనిమీలనమ్ము లో
నిహితమొనర్చి దుర్విషయనిర్వృతిసేసి మనోంధకారమున్
నిహతమొనర్చి భాద్రపదనీరదకాంతినితాంతమాధురీ
మహితసమాధి నా మనసు మగ్నముగావుట యెప్పుడో కదా.

ఉ. ద్రాక్షరసంబు క్షీరమును ద్రావితి శర్కరగొంటి వాసహ
స్రాక్షుని వీడునం దమృత మారఁగఁ గ్రోలితి రంభమోవి దం
తక్షతముల్ రచించితి యథార్థము సెప్పుమ కృష్ణ యన్న రెం
డక్షరముల్ బలెన్ మధురమా కడగండ్లనుబడ్డ జీవమా.

క. తరుణతరంబగు క్రానుఁగు
తరువో మరకతమణీకుధరమో యని ని
వ్వెఱపడిరి దవ్వునను రఘు
వరుఁ గన్గొని రామచంద్రుఁ బరమమునీంద్రుల్.

క. జగదండమెల్ల నశ్వర
మిఁగఁ గాయముఁగూర్చి పలుకనేటికి జను లీ
నగుఁబాటుమనికి కెన్నియొ
యగచాట్లకు నోర్తు రెంతయజ్ఞానంబో.

మ. భవరోగమ్ములకుఁ మహౌషధము పాపగ్రావదంభోళి పం
చవిధక్లేశ మహామహీరుహహుతజ్వాలాజటాలానలం
బవదాజ్ఞానతమోర్కబింబ మల కృష్ణా యన్న వర్ణద్వయం
బవుఁబో ముక్తిసతీవిహారసదనద్వారంబు భక్తాళికిఁ.

క. ప్రతిదినము మృత్యువాతఁ
హతులగు జనములను గన్నులారఁ గనుచు నా
మతి యిపుడును విషయేచ్ఛా
స్మృతి యకటా విడువ దేమిచిత్రంబొకదే.

మ. మనమా నీకు హితమ్ము సెప్పెదను విన్మా బృందలో నాలమం
దను గాపాడు ఘనాఘనాపఘను పొంతం బోకు మవ్వాంపుఁ దీ
యని పీయూషము జాఱు చిర్నగవు నిన్నాసాసలం గొల్పి యొ
క్కనిమేషాన హరించు నీ వలచు భోగమ్ముల్ మనోరాగముల్.

చ. హృదయమునందుఁ బాదుకొని యేది యనిర్వచనీయ సౌఖ్యపుం
గుదు రగుఁ గంఠలగ్నమయి కూల్చు మనోంధతమస్సు నేది తీ
యఁదనమునందు ద్రాక్షలకు నగ్గలమౌనెది యట్టి కృష్ణయఁ
పదము రసజ్ఞ వీ వగుదువా రసనా భజియింపు మాటికిఁ.

క. ఎరమైన ఖడ్గధారకు
శిరము కృతాంతుండు పట్టి ఛేదించిన రా
జ్యరమకు విలయమయిన నం
తరాత్మ విడకుండుఁగాత ధర్మపథమ్ముఁ.

క. పృథివీతలసంచరణ
వ్యథఁ గుటిసేయనేల నంతఃకరణం
బధిరోహించెఁ బరుండగు
మధురానగరీవిహారి మచ్చిరమందున్.

చ. సకలవ్యాపక మేనితేజము జగజ్జాలమ్ము వెల్గించు నే
యకలంకుండు నిగూఢ మాదరు వహమ్మున్ దెల్వి కవ్విష్ణు నెం
దో కనం జూచెద రాత్మనున్న పరతత్త్వన్ గుర్తుపట్టంగ నో
పక యీ యక్రమ మెట్టిదన్ శివశివా వర్ణింపలేఁడే కదా.

తే. వయసు ముగిసెను నెత్తిపై వ్రాలె మిత్తి
యిప్పుడా నిద్ర జీవుఁడా ముప్పుగనక
నీకుఁ గొఱతేమి హాయిగా నిద్రవొమ్ము
తల్లి గంగాభవాని నీ దరినెకలదు.

మ. తమమేనుల్ భవమన్నిదాఘతప నోత్తప్తంబులై మాఁడ శీ
ఘ్రమ యజ్ఞానపు సంకెలన్ బలమునన్ ఖండించు నైరాశ్యతా
సుమహాశీతల మాత్మచింతనసుధా స్రోతస్వినీవారి స్నా
నము గావింతురు పుణ్యజీవు లఘహంతల్ నిర్గత శ్రాంతులై.

చ. సవనములాది సేయుఁగద సంసృతిముక్తికిఁ గర్మపాశముల్
తవిలి పఠించుఁగాదె ఋషిదత్తమతోక్తులు నాత్మశాంతికిన్
భవజలరాశి దాఁటుటకుఁ బావనతీర్థము లాడుఁగాదె యీ
భవజలరాశిఁ గ్రుమ్మఱెడు పామరజాతి కిదెల్ల మాఢ్యమే.

క. గణికాజామిళముఖదు
శ్చణులను మన్నించి ప్రోవఁ జాలిన దేవా
గ్రణివి భవమను మరుస్థలి
నణఁగారిన యణువు ననుఁ గటా విడిచెదవే.

చ. మదగజరాజగండమదమత్తమధువ్రతమాధురీగుణా
స్పదకలఝాంక్రియాసుభగసంపద మాకు క్షణంబుగూడ వ
ల్లది మదిరారసంబటు తదర్థుల కన్నులుగప్పి గోపికా
వదనచకోరచంద్రు పదభక్తికి రిక్తులఁజేయుఁ గావునన్.

చ. అలఁతులయిండ్ల భూతి సుకృతాత్ములయిండ్ల దరిద్రదేవతా
కలకల మున్న తాత్ములకుఁ గాలము చేరువ దుష్పథానువ
ర్తులకును దీర్ఘమాయు విడు దుర్ణయముం గని క్రోధ పావకో
చ్ఛలిత శిఖల్ దహించినను శంకర దీనుఁడ నేమిసేయుదున్.

మ. తన వీణాగుణనిక్వణధ్వనియెడం దాత్పర్యమున్ సేయ కె
వ్వని వాక్యామృతవాహినీరసము నాస్వాదించు వాగ్దేవి త
త్ఫణితుల్ పండితరాజకర్ణసుభగస్వాదిష్ఠముల్ వించు నే
జనుఁ డూఁపండు శిరమ్ము వాఁడు పశువో సాక్షాత్పశుస్వామియో.

మ. కనకాద్రీంద్రముదొట్టి గంధగిరిదాఁకన్ వార్నిధుల్ సుట్టి రాఁ
జను భూమింగల కావ్యకల్పనచణుల్ శంకింపకే తెల్పుఁ డీ
ఘనుఁ డెవ్వండు మదన్యుఁ డిక్షురసశిక్షాదక్షదీక్షావచః
ప్రణుతాచార్యమహాపద మ్మనుభవింపంజాలు వాఁడుండెడిన్.

మ. రచనామార్గ్మికుఁ డౌదువేని బరిణతద్రాక్షామరందద్రవ
ప్రచురాహంపరిహారివాఙ్మయకలాపంబైన నీ కావ్యమున్
వచియింపం జనుదెమ్ము మాదృశసమీపంబందుఁ గాదేనిఁ ద్వ
ద్రచితం బాత్మకృతాఘమట్లు వెలికిన్ రానీకు మెన్నేన్ సఖా.

ఉ. స్త్రీయధరామృతంబు సుధ తేనియ ద్రాక్షయు నెందు నేరి కా
స్వాయనముం బొనర్పనివియైనను బండితరాజవాక్కలా
శ్రీ యలరింప దేనరుల జీవితులయ్యును వారికన్ మృత
ప్రాయులె మందబుద్ధులు ద్విపాత్పశువుల్ మనుజాధమాధముల్.

ఉ. ఏల విషాదమంద ఖలు లెవ్వరొ నా కవితాకుమారి యీ
శ్లాఘ్యులనాదృతిన్ సలిపిరంచును గావ్యకలాబ్జినీమరం
దాలససంచరన్మధులిహాననరంగమునన్ రసధ్వని
శ్రీ లెసఁగంగ నర్తనము సేయవె నీవు విచిత్రభంగులన్.

మ. పరవాచాంరచనాకృతిస్తుతికలావాచంయముల్ పండితుల్
ధరణీపాలురు శ్రీవిలాసమదిరాతంద్రాప్రమత్తుల్ రతి
త్వరపీడాలసనాకయోషిదధరస్వాదూపహాసంబు మ
త్సరసాలాపవిపాక మేసుకృతి యాస్యంబందు లాస్యంబిడున్.

క. భువిఁ బండితరాజమహా
కవితామాధుర్యమునకుఁ గావించు నతుల్
నవనీతైకవమాక్షిక
గవాంరసద్రాక్ష లమృతగర్వాపహముల్.

మ. తుదముట్టంగనె సర్వశాస్త్రములలోఁతుల్ నిర్వహించెన్ విధుల్
మృదులంబౌ నిజయౌవనం బునిచె ఢిల్లీనాథు కెంగేల నా
పిదపన్ శ్రీవిభుఁ గొల్చుచున్ మధురలో నిర్వాసి తైంద్రక్రియా
పదుఁడై సర్వ మొనర్చెఁ బండితకులప్రఖ్యాతుఁ డుల్లోకమున్.

క. హరియింతురు జారజులగు
దురితాత్ము లటన్న శంకతోఁ జేటికగా
విరచించినాఁడ మత్ప
ద్యరత్నములఁ బదిలపఱుపఁదగు నిందనుచున్.

క. పనితస్వతంత్రభూజీ
వనుచే సారస్వతైకపరతంత్రకలా
ధనుచే శాంతవిలాసం
బనూదితంబయ్యె బుధజనారాధ్యంబై.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA110B114 |
| పుస్తకం పేరు | భామి నీవిలాసము |
| తారీఖు | 10 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 26B, C1, BC2, 38, [illegible] |
| లేని పేజీలు | 1, 2 |
| తయారు చేసినది | Mary |
| పేజీలు విడదీసినది | Mary |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |

blanks - 40